ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్

రిజిష్టర్డ్ కార్యాలయం

3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర.)

ఇతర కార్యాలయాలు

బొంబాయి కలకత్తా మద్రాసు కొత్త ఢిల్లీ
బెంగుళూరు హైదరాబాద్ పాట్నా
గౌహతి లక్నో భువనేశ్వర్


ISBN 81 250 0085 2

ప్రచురణ

ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

టైప్‌సెట్

ఎస్.కే.వి. ఇండస్ట్రీస్, గొలిగూడ, హైదరాబాద్ 500 012.

ముద్రణ
ట్విన్ సిటీస్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, హైదరాబాద్

# మా మాట

సాహిత్యం వెన్నెల బాటయితే కృష్ణశాస్త్రి కవిత ఆ మార్గాన పరుగులు తీసే వెండి రథం. ఆయన కలం వెలార్చిన ప్రతి కవిత ప్రతిపదం మీ ముందుకు తేవాలనే మా ప్రయత్నంలో అముద్రితాలైన అరుణరథం, కొత్తకోవెల, బదరిక, మూగనయాక, విద్యాపతి మొదలైన వాటి ప్రచురణలలో మేం రవ్వంత ఇబ్బంది పడిన మాట వాస్తవం. ఎలా అంటే ఈ వ్రాతప్రతులు ఎప్పుడో ట్రంకు పెట్టెల్లో భద్రపరవడం వల్లనూ, కాగితాలు పాతవై పోయి పట్టుకుంటే చిరిగిపోయే శిథిలావస్థలో ఉండడం వల్లనూ, ఇంకు పెన్నుతో రాయడంతో కొన్ని అక్షరాలు చెరిగిపోవడం వల్లనూ, కొన్ని అసంపూర్ణంగా వదిలేసి ఉండడం వల్లనూ మాకు ఇబ్బంది కల్గింది. అందువల్ల వాటిని భావం మారకుండా, అర్థవంతంగా ఉండడంకోసం కొన్ని చోట్ల మార్పులు, చేర్పులు చేయవలసి వచ్చింది.

అసలు వీటన్నిటినీ సంకలనం చేసి, సంపాదకీయ బాధ్యతలను చేపట్టి ఉత్తరాల ద్వారా మాకు సలహాలు, సూచనలు అందజేసిన బాలాంత్రపు నళినీ కాంతరావు గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు. ప్రూఫులు దిద్దడంలో మాకు సహాయాన్నందించిన బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారికీ, ఇస్మాయిల్ గారికీ మా ప్రత్యేక కృతజ్ఞతలు. మిగిలిన పుస్తకాల కంటే ఈ పుస్తకాల ప్రచురణలో మేం కొంచెం ఎక్కువ శ్రమే పడవల్సి వచ్చింది. అయినప్పటికీ ఈ పుస్తకాలు మీ ముందుకు తేగలిగిన ఆనందం ముందు అది తక్కువే అన్పిస్తుంది. నిజానికి కృష్ణశాస్త్రి లేని లోటు కొట్టొచ్చినట్టు కనిపించింది. ఆయన వెండిరథాన్ని ఒడిదుడుకులు లేని బాటలో నడిపించాలని మేం చేసిన ఈ ప్రయత్నంలో మీకుగానీ ఇబ్బంది కల్గితే అదికేవలం రథసారథి లేకపోవడంవల్ల మాత్రమేనని సాహితీ ప్రయాణీకులకి వినయపూర్వకంగా విన్నవించుకుంటున్నాం.

ఓరియంట్ లాఙ్మన్

# ముందు మాట

కృష్ణశాస్త్రిగారు గుర్తుకు వచ్చినప్పు డల్లా ఆయనే ఎక్కడో ఎప్పుడో ప్రస్తావించిన దృశ్యం నా మనస్సులో బొమ్మ కడుతుంది. కవిత్వం రాయటం ప్రారంభించిన తొలిరోజుల్లో, అంటే డెభ్భై ఏళ్ల క్రితం, ఒక అర్ధరాత్రి సామర్లకోట ప్లాట్ ఫాం మీద ఈయనా, నండూరి సుబ్బారావు తారసపడ్డారట. నువ్వేం రాస్తున్నావు? అంటే, నువ్వేం రాస్తున్నావు? అని కుశల ప్రశ్నలు వేసుకుని, ఒకరి గేయా లొకరికి వినిపించి, సుబ్బారావు రైలు ముందు రాగా, ఆయన్ని రైలెక్కించి, తన రైలు కోసం ప్రతీక్షిస్తూ దీపస్తంభపు క్రీనీడలో పిట్టలాగా ముడుచుకు కూచున్నానని రాశారు శాస్త్రిగారు. ఒంటరితనంతో బరువెక్కిన ఈ చిత్రం ఆనాటి కృష్ణశాస్త్రికి ప్రతీకగా నాకు తోస్తుంది.

ప్రతి మనిషీ తన అస్తిత్వ కేంద్రంలో ఒక మహాశూన్యంతో పుడతాడు. ఆ శూన్యాన్ని బహిఃప్రపంచంతో, ప్రాపంచిక సౌందర్యంతో, తత్ఫలితమైన ఆనందంతో నింపగలిగే శక్తి, సాధనా బహుకొద్దిమంది సృజనకారులకు ఉంటుంది. మానవ జన్మకు శాపమైన ఆ శూన్యాన్ని కృష్ణశాస్త్రిగారు అద్భుత, సౌందర్యమయ ప్రపంచంతో నింపారు. ఆత్మస్వేచ్ఛకీ, సృజన శక్తికీ ప్రతీక అయిన ఊర్వశిని ఆ శూన్యంలో నిలిపారు.

ఈ తపస్సూ, అన్వేషణా ఒకనాటివి కావు. 'కృష్ణపక్షం'లో ప్రకృతితో తాదాత్మ్యంతో మొదలై, ఆత్మకీ, స్వేచ్ఛకీ, అద్వైతాన్ని తెలుసుకుని, సౌందర్యాన్వేషణలో పండి, ప్రేమకై తపించి, విరహాగ్నిలో కాగి, లోకం చేత నిరసింపబడి, ఆత్మదైన్యంతో

క్రుంగి; తరవాతి కావ్యమైన 'ప్రవాసం'లో అన్వేషణ తీవ్రతరం కాగా, దుఃఖంతో నిర్వేదంతో ఐక్యం చెంది, చివరికి 'ఊర్వశి' కావ్యంలో స్వేచ్ఛకీ, సౌందర్యానికీ, ప్రేమకీ, కవి సృజన శక్తికీ సంశ్లేష మూర్తియైన ఊర్వశిని సాక్షాత్కరింప చేసుకున్నారు. తనలోని మౌలిక శూన్యాన్నించి కృష్ణశాస్త్రి సాగించిన ఈ అన్వేషణ, దుఃఖమూ, నిర్వేదమూ సాధనాలుగా, చివరికి ఊర్వశీ మూర్తిని అందుకుంది.

* * *

కృష్ణశాస్త్రిగారి కవిత్వం రెండు ప్రవాహాల సంగమం. ఒకటి భాషకి సంబంధించింది. రెండోది ఆలోచనకీ, వ్యక్తిత్వానికీ సంబంధించింది. తెలుగు భాషా, దాని నుడికారపు సొంపులూ తరతరాలుగా ఆయన వంశీయుల రక్తంలో జీర్ణమై పోయాయి. నాలుగు వందల యేళ్ల నించి వారి పూర్వీకులు పిఠాపుర సంస్థాన కవులూ, పోషితులూనూ. వారి నాన్నగారు తమ్మన్న శాస్త్రిగారూ, పెదనాన్నగారు సుబ్బరాయ శాస్త్రిగారూ గొప్ప పండితులూ, కవులూ. వారి వద్ద స్వయంగా భారత, భాగవతాదులూ, ప్రబంధాలూ చదువుకున్నారీయన. శాస్త్రిగారికి ఇష్టతముడైన కవి నన్నయ్యభట్టు. తరవాత తిక్కన. ఆ తరవాత రామకృష్ణుడు. శబ్దప్రయోగం, కవిత్వ శైలుల విషయంలో ఈయన నన్నయ నించి నేర్చుకున్నది చాలా ఎక్కువ. "శబ్దానికి ప్రాణమే కాదు, పక్షాలూ ఉన్నాయి. ఒక శబ్దాన్నీ మరొక శబ్దాన్నీ ఒక ధోరణిలో కలిపి, ఒక విలక్షణమైన గానం పుట్టించి, దాని రెక్కల మీద కూర్చోబెట్టి, ఎట్టి దూరానుభవాలనైనా అందజేసి, ఎట్టి దూరలోకాలనైనా కనపరచి విహరింపజేస్తూ ఇంకా వెనకాల నున్నవేవో స్ఫురింపజేసే శక్తి ఒకటి ఉంది. అది నన్నయది. శబ్దం పలకడమే కాదు పాడుతుంది," అంటారీయన.

శబ్దం చేత పాడింప జేసే నైపుణ్యం ఈయన నన్నయ దగ్గిరే నేర్చుకున్నారు. శాస్త్రిగారికి పాటంటే మోజు. మాటకు లేని శక్తి పాట కుందని ఈయన నమ్మకం. ఈయనంటారు: "పాటకు ఒక శక్తి ఉంది. మాటల కందని వాటిని చెప్పుతుంది. ఏ అనుభవమైనా, తన్మయత్వం దాకా తీసుకుని పోయేటప్పటికి మనం దానిని వ్యక్తపరచడానికి సంగీతాన్నో, దాని ఆభాసాన్నో సాయంగా తీసుకుంటాము.. ఇక మహాకవికి మామూలు దృశ్యాలను మించినవి సాక్షాత్కరిస్తాయి గదా! మామూలు ఆవేశాలని మించినవి ఊగిస్తాయి గదా! వాటిని ప్రకటించడానికి సామాన్య శబ్దాలూ, ఎక్కడెక్కడి మాటలూ ఏరి తెచ్చి వాటిని రకరకాల కూర్పుల్లో పెట్టి, చిత్రచిత్రాలుగా నడిపించి, ఒక వింత గానం పుట్టించి, తనకు సాక్షాత్కరించిన దాన్ని మనకు కూడా ప్రత్యక్షం చేయడానికి ఆయన ప్రయత్నిస్తాడు. ఈ శక్తి నన్నయకున్నట్లు ఆంధ్రకవులలో ఎవరికీ లేదు."

కృష్ణశాస్త్రిగారి కవితాశైలి మీదా, పద్యం, పాటా నడిపించే ఒడుపు మీదా నన్నయ ప్రభావం మిక్కుటంగా ఉన్నట్టు తోస్తుంది.

* * *

కృష్ణశాస్త్రిగారి కవిత్వంలోని రెండో వాహిని ఇంగ్లీష్ విద్యాసంస్కారం. ముఖ్యంగా బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి వద్ద అధ్యయనం చేసిన ఇంగ్లీష్ రొమాంటిక్ కవిత్వమూ, సూఫీ కవిత్వమూ, రవీంద్రుని కవితార్ణవమూ.

పద్దెనిమిదో శతాబ్దం చివర ఫ్రెంచి తాత్త్వికుడు రూసో భావాల నించి అంకురించిన రొమాంటిక్ ఉద్యమం వ్యక్తి స్వేచ్ఛని ప్రాతిపదికగా తీసుకుంది. మనిషి సహజంగా మంచివాడు, సమాజం

వల్లి చెడతాడు; సమాజం కన్నా వ్యక్తి ముఖ్యం, వ్యక్తి స్వేచ్ఛ పునాదిగా లేని సామాజిక నియమాలకు తలవంచనఖర్లేదు అని వీరంటారు. ఈ ఉద్యమం మౌలిక మానవ స్వభావంలోనే గొప్ప మార్పు తీసుకు వచ్చినట్లుంది. అంతవరకు మహత్తర మానవశక్తిగా కొలిచిన బుద్ధిని (reason) పదవీచ్యుతం చేసి, ఇంద్రియానుభూతిని (sensibility) సింహాసనం ఎక్కించారు. విశ్వాన్ని నడిపించే అదృశ్య శక్తుల్ని ఇంద్రియానుభూతి, లేదా చేతన, ద్వారానే తెలిసికోగలమని వీళ్లు ఖచ్చితంగా నమ్మారు. మానవ ప్రకృతికీ, భౌతిక ప్రకృతికీ సన్నిహితాలూ, సమాజానికి అతిరిక్తాలూ ఐన భావోద్రేకాన్నీ, వ్యక్తి చేతననీ వీళ్లు పైకెత్తారు.

వ్యక్తి స్వేచ్ఛ అంటే మనిషి తన స్వధర్మాన్ని వ్యక్తపరచ గలిగటమే. ప్రేమా, ప్రకృతితో తాదాత్మ్యమూ ఈ స్వేచ్ఛ యొక్క అభివ్యక్తులే. ఆత్మస్వేచ్ఛా, ప్రేమా, తాదాత్మ్యమూ అన్నీ ఒక్కటే. వేరు వేరు కావు. తన స్వధర్మాన్ని అన్వేషించటం, దాన్ని వాస్తవీకరించు కోవటమూ, ఇవి రెండూ కృష్ణశాస్త్రిగారి కవితా ప్రస్థానంలో ముఖ్యాంశాలు. తన ఆత్మాభివ్యక్తికి ప్రతీక, ఐన ఊర్వశిని సాక్షాత్కరించుకోవటంతో కృష్ణశాస్త్రిగారికి చివరికి తపస్సిద్ధి కలిగింది.

* * *

అగ్నిపర్వతం మరిగి మరిగి, సెగలు వెలిగ్రక్కి చల్లారాక, వర్షాలు కురిసి నిర్మలాకాశాన్ని ప్రతిఫలించే సరస్సుగా మారి, అందమైన పద్మాల్ని వికసిస్తుంది. కృష్ణశాస్త్రిగారి తరవాతి రచనలైన పాటలూ, యక్షగానాలూ, రేడియో నాటికలూ అటువంటివి. ఆత్మమథనం, అన్వేషణా, సమన్వయం కోసం సంఘర్షణా, ఏవీ లేవు. భాషతో, సంగీతంతో పదాల సొగసులతో, వంపులతో అభినివేశం ఒక్కటే

మిగిలింది. తెలుగు కావ్య సంప్రదాయానిదే పై చెయ్యి. నన్నయ్యా, తిక్కనా, రామకృష్ణుడూ దగ్గరివారయారు.

కవిత్వానికీ, సంగీతానికీ సన్నిహిత సంబంధం ఉందని శాస్త్రిగారి అభిప్రాయం. కవిత్వం సంగీత స్థాయికి ఎదగా లంటారు. సంగీత మంత భావస్ఫోరకంగా ఉండాలంటారు. "కవిత్వంలో శబ్దం పలకడమే కాదు - పాడుతుంది. వచన కావ్యానికీ, పద్యకావ్యానికీ ఉన్న తేడా గమన తీవ్రతే అంటాడు - మిడిల్‌టన్ మర్రే. ఈ గమన తీవ్రత సాధించ డానికే పద్య నిర్మాణంలో శబ్దాలను మరీ సార్థకంగా ఏరడం, మరీ బిగువుగా చేర్చడం, వింత వింతె ఛందస్సులలో కూర్చడమున్నూ. భావ గీతం వంటి పద్యకావ్యం దగ్గిరికి వెళ్లేటప్పటికి శబ్దం పాటే అయిపోతుంది. 'కవిత్వం శబ్దరూపంలో ఉన్న గానం' అని దీనినే అన్నాడు కార్ లైల్."

ఇంకా ఇలా అంటారు: "మంచి పాటలు వ్రాసేవాడికి, నిజమైన పాట వ్రాసేవాడికి లోపల కూడా అంతరంతరాల్లో సంగీతం వచ్చి ఉండాలి. ఏ అనుభూతికి ఏ రాగమో, ఏ వరసో ఏ విరుపో, ఎక్కడ ఏ నొక్కో, ఏ ఒదుగో, సరిగా మాటా అవీ కలిసి వస్తాయి. నే ననుకుంటాను,గేయానికి ఎక్కువ నగలు తొడగకూడదని - శబ్దార్థాలంకారాలూ అవీ! వాటి బరువు పాటని ఎగరనివ్వదు. లోతులకు రివ్వుమని దిగనివ్వదు."

ఎన్ని రకాల పాటలు రాశారో శాస్త్రిగారు. తెలుగు ప్రపంచ మంతా, తన పొలాలతో, గట్లతో, కాలవలతో, పాటక జనంతో, పిల్లలతో, స్త్రీలతో, వాళ్ల ఆనందాలతో, ఆశలతో, దుఃఖాలతో వాటిల్లో ప్రతిఫలిస్తుంది. తెలుగు ఇళ్లల్లో, వీధుల్లో, పెళ్లిపందిళ్లల్లో, చేలల్లో, తోటల్లో, కాలవగట్ల మీదా యుగయుగాలుగా నిగ్గ తేరిన

పదాల, జావళీల నుడికారపు అందం, మలుపుల సొగసూ, విరుపుల ఒయ్యారమూ ఆయన పాటల నిండా విరిసి మనల్ని అలరిస్తాయి. క్షేత్రయ్య తరవాత ఇంతటి గేయకారుడు రాలేదని నా అభిప్రాయం.

* * *

కృష్ణశాస్త్రిగారి పద్యం కన్నా గద్యమే గొప్పగా ఉంటుందని పద్మరాజుగారు అంటుండేవారు. చాలా మంది గొప్ప కవుల గురించి ఇటువంటి రిమార్కులు వింటుంటాం. నిజానికి, కవైన వాడికి గద్యం, పద్యం రెండూ ఒకటే.

శాస్త్రిగారి గద్యరచనలు చాలా మట్టుకు రేడియో కోసం రాసినవి. వీటి వైవిధ్యానికి అంతు లేదు. సాహిత్య విమర్శ మొదలు బామ్మగారి ముచ్చట్ల వరకు అన్ని జీవిత కోణాల్నీ స్పృశిస్తాయి.

ఎందుకంటే, కృష్ణశాస్త్రిగారి గుండెల్లో అందరికీ, అన్నిటికీ చోటుంది. నేను మానవతా వాదిని, వట్టి హృదయవాదిని అని తరచూ అంటుండేవారు. ఇది ముమ్మాటికీ నిజం. ఆయనలా అరమరికలు లేకుండా జనాన్ని ప్రేమించిన వాళ్లని నేను చూడలేదు. ఎల్లప్పుడూ ఆయన చుట్టూ జనం ఉండవలసిందే, ఆయన కబుర్లు చెబుతుండాల్సిందే. గొంతుక ఆపరేషనై, స్వరపేటిక తీసేశాక కూడా ఆయన నోట్ బుక్కుల ద్వారా సంభాషణ సాగించేవారు. ఇటువంటి నోట్ బుక్కులు కొన్ని వందలో వేలో పోగయాయి.

ఇంత కరుణార్ద్ర హృదయం ఏ వరం వల్ల సిద్ధిస్తుంది? అని ఆశ్చర్యపడుతుంటాను అప్పుడప్పుడు. ఆయనే అంటాడు: "బాధ వరం. బాధకి చాలా శక్తులున్నాయి. బాధలో కాలిపోయేవాడు పాషాణం కాలేడు... బాధ దృష్టిని నిశితంగా చేస్తుంది, దయార్ద్రంగానూ చేస్తుంది. వేదనలో వేగిపోయేవాడు బాహ్యవిశ్వంలోకీ, మానవ

ప్రకృతిలోకి చొచ్చుకొని పోయి లోపల లోపల పెల్లగించిచూస్తాడు. అప్పుడొక విధమైన అనుకంప కలుగుతుంది; ఒక విశ్వజనీన బాంధవ్యం ఏర్పడుతుంది... వేదన వల్ల గాని ప్రేమ కలగదు. ఈ రెండూ కలిస్తే కరుణ అవుతుంది. ఈ రెండూ కల హృదయం సదా స్నిగ్ధం."

"అలాగే కావ్య కల్పనలో కూడా. ఏ కావ్య సృష్టికయినా ఈ కరుణే కారణం.. కనుక, ఈ విశ్వ ప్రేమ – ఈ కరుణ కావ్య నిర్మాణానికి కారణమౌతుంది. అంతే కాదు.ఈ విశ్వప్రేమను, కరుణను ఇతరుల హృదయాలలో కలిగించడమే కావ్యానికి ముఖ్యోద్దేశమని కూడా తత్త్వవేత్తలంటారు."

"నిందించడానికీ, కీర్తించడానికీ కాదు. మానవుని మానవునిగా చేయడానికే కావ్య నిర్మాణం.

" ఈ అనుకంప ఎంత లోపల ఉంటే అంత మానవత్వం మానవుల్లో ఉన్నదన్నమాట. దానిని ఎంత ప్రభవింప చేస్తే అంత గొప్పదన్నమాట ఆ కావ్యం!"

"అటువంటి కావ్యాలు చదివి ఆ విశ్వప్రేమ తాత్కాలికంగా అనుభవిస్తున్నప్పు డయినా, ఆ దయా విధానంలో అందరూ అత్యవసరమేనని గ్రహించుకుంటాం. దాని వల్ల లోకంలో ద్వేషం కరిగిపోతూ ఉంటుంది."

ఇదీ కృష్ణశాస్త్రిగారి కవిత్వ తత్త్వం.

'కృష్ణశాస్త్రి బాధ – ప్రపంచం బాధ; ప్రపంచపు బాధ శ్రీ శ్రీ బాధ' అన్న చలం మాట అర్ధసత్యం మాత్రమే!

కాకినాడ ఇస్మాయిల్

30.10.93.

# విజ్ఞాపన

"మొట్టమొదటిసారి నేను కృష్ణశాస్త్రి వ్రాసిన 'అబ్బ!' అనే పద్యం ఏదో పత్రికలో చదివాను. చదివి 'అబ్బ!' అనుకున్నాను. అటు తరువాత కృష్ణశాస్త్రి రచన ఏది చదివినా, అతని ప్రసంగం ఏది విన్నా 'అబ్బ!' అనిపిస్తూనే ఉంది." అన్నారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఒక సాహిత్య సభలో[2]. కృష్ణశాస్త్రి ప్రసంగం అనంతరం తాను ప్రసంగం ఆరంభిస్తూ.

కృష్ణశాస్త్రి రచనల పట్ల ఒక 'విశ్వనాథ' ప్రతిస్పందన మాత్రమే కాదు ఇది. తెలుగు రసజ్ఞ లోకం అంతటి ప్రతిస్పందననే 'విశ్వనాథ' ఆనాడు ఆ విధంగా అభివ్యక్తం చేశారు. ఆది నుంచీ కృష్ణశాస్త్రి పద్యాలు, ప్రసంగాలు, చివరికి సినిమా పాటలూ కూడా తెలుగు రసజ్ఞలోకం చేత 'అబ్బ!' అనిపిస్తూనే వచ్చాయి.

ఇప్పుడు - ఇవి కృష్ణశాస్త్రి శ్రవ్యనాటికలు ఆకాశవాణి వివిధ కేంద్రాలనుంచి ప్రసారితమైనవి. నిజానికి ఈ నాటికలలో దేనికదే విలక్షణమైంది. అయినా స్థూలంగా - దేశభక్తి ప్రధానమైనవీ, భక్తి రసప్రధానమైనవీ, శృంగార ప్రధానమైనవీ అని మూడు వేర్వేరు

1. చూ.కృష్ణపక్షం - పుట 50, ఓరియంట్ లాఙ్మన్ ప్రచురణ, 1992
2. 1945 ప్రాంతంలో ఏలూరులో సాహిత్య మండలి వారి ఆధ్వర్యంలో జరిగిన సభ అది. చుండూరి వారి సత్రం ఆవరణలో ఏర్పాటు చేసిన బ్రహ్మాండమైన ఆ సాహిత్య సభలో యెంకి పాటల మహాకవి శ్రీ నండూరి సుబ్బారావుగారు ఆ నాటి వర్ధిష్ణు కవి శ్రీ కొనకళ్ల వెంకటరత్నాన్ని సన్మానించారు. ఆ సభకు అధ్యక్షులు, శ్రీ తల్లావఝుల శివ శంకర స్వామి; వక్తలు : కృష్ణశాస్త్రి, విశ్వనాథ, శ్రీ శ్రీ, సభా సంచాలకుడు బి.వి. సింగరాచార్య.

సంపుటాలుగా వెలువడుతున్నాయి. ప్రతి సంపుటంలోనూ మొదటి నాటిక శీర్షికే ఆ సంపుటానికి శీర్షిక అయింది.

దృశ్య నాటికకు ఉన్నన్ని హంగులు శ్రవ్య నాటికకు ఉండవు. రంగస్థల ప్రసాధనం, పాత్రల ఆహార్యం, నటీనటుల ఆంగికాభినయం, హావభావ ప్రకటనా – అన్నీ 'సాహిత్యం' ద్వారా కవి సమర్పించే రస, భావాదులకు దృశ్య నాటికలో దోహదం చేస్తాయి. 'సాహిత్యం' పని సులువవుతుంది. శ్రవ్య నాటికలో అలా కాదు. పాత్రల పరిచయం, శ్రోతల మనస్సులో రంగస్థల భావనా ప్రకల్పనం వంటివి అన్నీ సంభాషణల ద్వారానే – ధ్వనుల ద్వారానే సాధించాలి. ఒక వంక ఇన్ని అదనపు పనులు నిర్వహిస్తూనే 'సాహిత్యం' మరొక వంక శ్రోతల మనస్సులలో రసభావాలను ఉద్దీపితం చేయాలి. శ్రవ్య నాటికా రచన కత్తి మీద సామువంటిది.

అయితే – దృశ్య నాటికకు లేని అదనపు సౌకర్యాలు కొన్ని శ్రవ్య నాటికకు ఉన్న మాట నిజం. క్షణంలో రంగాన్ని భూలోకం నుంచి స్వర్గలోకంలోకి తరలించవచ్చు. కొంచెం విరామ సంగీతంతో క్షణంలో రంగాన్ని ఎక్కడికైనా మార్చవచ్చు. పక్షుల అరుపులు, వాన హోరు వంటి విచిత్ర ధ్వనుల కల్పన ద్వారా చిత్ర విచిత్రాలైన 'ఎఫెక్ట్స్' సాధించ వచ్చును. ఈ దృశ్య నాటికలలో సూత్రధారుణ్ణి తీసివేసినా తీసి వేయవచ్చును కాని, శ్రవ్య నాటికలో ఒక ప్రయోక్త పాత్ర తరచు అవసరం అవుతూ ఉంటుంది. శ్రవ్య నాటికకు ఉన్న ఇలాంటి ప్రత్యేక అవకాశాలను అద్భుతంగా వినియోగించుకోడం కృష్ణశాస్త్రిగారి ఈ నాటికలలో మనం చూస్తాము.

1940 ప్రాంతంలో విజయవాడ ఆకాశవాణి కేంద్రం నుంచి ప్రసారమైన నాటికలలో కొన్ని పాటలు ఆ రోజులలో యువకవులమైన అస్మదాదులను వెంటాడి, వెర్రెత్తించి, తెలుగు పదాల కూర్పులో ఇంతటి మాధుర్యాన్ని, ఇంత ఇమిడికను – సాధించవచ్చునా అని ఆశ్చర్యపోయేట్టు చేసేవి. అలా ఆ రోజులలో నన్ను వెంటాడిన ఒక పాదం ఇప్పటికీ నాకు జ్ఞాపకం ఉంది.

'ఆషాఢ యోషామణీ కేశపాశాన
అల్లుకొన్నది తటిద్వల్లియో' (శ్రీ విద్యాపతి -/పుట 15)

ఇలా ఆ నాడు కృష్ణశాస్త్రిగారి శబ్ద సంయోజన నైపుణి వెర్రెత్తించిన అస్మదాదులలో శ్రీ శ్రీ కూడా ఉన్నాడు. కృష్ణశాస్త్రిలాగా పద్యం వ్రాయాలని ఆయన చేసిన తపస్సు ఆయన 'ప్రభవ'లో కనిపిస్తుంది.

సంస్కృత భాషను ఎంత లలితంగా, ఎంత మధురంగా మలచవచ్చునో లీలాశుకుడూ (కృష్ణకర్ణామృతం) జయదేవుడూ (అష్టపదులు) ప్రదర్శించినట్లు, తెలుగు భాషకుగల లాలిత్యాన్ని, మాధుర్యాన్ని, ఇమిడికనీ కృష్ణశాస్త్రి ఆవిష్కరించారు అనే మాట ఆయన శత్రువులు కూడా కాదనలేని నిజం.

ఈ శ్రవ్య నాటికల వ్రాతప్రతులు కృష్ణశాస్త్రిగారి జీవిత కాలంలో తయారైనవే అనడానికి కొన్ని పుటల మార్జిన్‌లలో, స్వదస్తూరీతో ఆయన వ్రాసుకున్న నోట్స్ తార్కాణం మచ్చుకి అలాంటి నోట్స్ కొన్ని ఇక్కడ ఇస్తున్నాను.

"రజనీ! కొన్ని పాటలు దిద్దాలి. నీవు జాగ్రత్తగా పరిష్కరించి బ్రాడ్ కాస్ట్ చెయ్యి!" (విద్యాపతి - పుట 1)

"ఊరికే పాటలూ, పద్యాలు చూడండి." (దక్షయజ్ఞం - పుట 1)

"అప్పుడు వ్రాసేశానా?" (దక్షయజ్ఞం - పుట 26)

"కట = శ్మశానం; విషగళుడైన కృపాళుడు" (దక్షయజ్ఞం - పుట 27)

"రామానుజాలు కంచి వదలి శ్రీరంగం వెళుతాడా? సెలవు తీసికోలేదు" (ప్రపన్న పారిజాతం - పుట 27)

"మాఅమ్మ పోయిన రోజుల్లో గోవింద రాజుల సుబ్బారావు వ్రాసినట్టు అతని పేర వ్రాసి ఇచ్చాను - అతని కథను అనుసరించి పూర్తిగా ఇది నాదే! One of my best అతనిది ఒక్క అక్షరం లేదు"

(మదన సాయకం - పుట 1)

వ్రాతప్రతులలో అక్కడక్కడ ఒకటి రెండు పద్యాలూ, కొన్ని డైలాగులూ లుప్తం అయినట్టు కనిపిస్తుంది. వాటిని అలాగే వదిలినా కథాక్రమానికి భంగంలేని రీతిలో స్వల్పంగా సవరించడం జరిగింది.

ఒక శ్లోకం వ్రాతప్రతిలో 'సన్న్యవ్యతి వైదిక' (ప్రపన్న పారిజాతం-పుట101) అని అసాధువుగా ఉంటే, యామునా చార్యులవారి 'స్తోత్రరత్నం'లో ఆశ్లోక పాఠాన్ని చూసి 'సన్న్యవ్యతి వైదికః కః' అని దానిని సవరించాము.

ఈ శ్రవ్య నాటికలను ఈ విధంగా మూడు సంపుటాలుగా విభజించి ప్రాథమికమైన ఎడిటింగ్ పని అంతా చేసిన వారు నా చిరకాల మిత్రులు, సహవ్రతి శ్రీ బాలాంత్రపు నళినీ కాంతరావుగారు. 'అమర్చి పెట్టిన దాంలో అత్తగారు వేలు పెట్టినట్లు" చివరి దశలో నేను చేసిన స్వల్పమైన పరివస్య.

ఈ నాటికల సంపాదక కార్యంలో ఈ స్వల్ప పరివస్య చేసే అవకాశం నాకు కలిగించిన ఓరియంట్ లాఙ్మన్ సంస్థకూ చిరంజీవి దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి (బుజ్జాయి)కీ నేను కృతజ్ఞుణ్ణి"

ఇతిశమ్!

బొమ్మకంటి
శ్రీనివాసాచార్యులు

1-9-34/5/1
రామ్‌నగర్,
హైదరాబాదు 500 048.

## ఇందులోని నాటికలు

అరుణరథం

జమదగ్ని

సుప్రియ

శ్రీముఖలింగం

# అరుణ రథం

[ప్రజల కోలాహలంతో కలిసి భారత జాతీయ గీతాలు దూరం నుంచి వినబడుతాయి.]

ఒక స్త్రీ : అయ్యా! ఈ మహోత్సవానికి కారణం ఏమిటి?

ఒక పురుషుడు : ప్రభాత వనంలో పక్షుల లాగ కోటాను కోట్ల ప్రజలు ఇంత కోలాహలం చేస్తున్నారు ఎందుకు?

ఒక వృద్ధుడు : సరిగ్గా చెప్పావు, ఇది ప్రభాతమే! అమ్మా! వినండి. నాయనా! సప్తాశ్వ సహితమైన అరుణ రథం కదలడం, అంధకారం పోవడం - ఇంతకన్న ఉత్సవ సమయం ఏముంది? ఒక చిన్న కథ ఉంది. ఆ గాథకు అంతరార్థం ఉంది.

స్త్రీ, పురుషుడు : చెప్పండి, చెప్పరూ తాతగారూ? వింటాం.

తాత : చెప్పనూ మరి ? ముందీ సంగతులు జ్ఞాపకం ఉంచుకోండి.

ఒకటి : ఈ రోజు రథసప్తమి. రెండు: స్వార్థమూ, సామ్రాజ్యవాదమూ తొలగిపోయి మనకు స్వాతంత్ర్యం వచ్చిన ప్రభాత సమయం. దీనికి సరిగ్గా సరిపోయే గాథ ఒకటి ఉన్నది, రుషులు చెప్పినది. మళ్లీ చెప్తా, వినండి.

[తాత పాటలాగ మొదలు పెడతాడు. శ్రోతలు ఊఁ కొడుతూ ఉంటారు]

వినరమ్మా మీ రీ కథను
వినరయ్యా మీ రీ కథను
వివరముగా సత్యమ్ము విశదముగ

స్త్రీ, పురుషుడు : ఆఁ, ఆఁ, ఆఁ, .....

తాత : ఈ లోకంలో మేరువూ, వింధ్యా అనే రెండు గొప్ప పర్వతా లున్నాయి.

స్త్రీ, పురుషుడు : అవునూ.

తాత : మేరు వన బంగారు ముద్ద
వింధ్య మది సత్త్వమున పెద్ద
ఎవరు హెచ్చెవరు లొచ్చనివారు-

స్త్రీ, పురుషుడు : ఊఁ, ఊఁ, ఊఁ,

తాత : ఆశ లీసులు పెరిగి అంతంతలై స్వార్థ
పాశముల లోకముల పట్టి పీడింపగా

ఒకస్త్రీ : అమ్మయ్యో!

తాత : నాక లోకావధులు
ఆకసముపై పరిధులు
అతిశయించుచు పోవ
అరుణ రథ పథమాగె-

అప్పుడు-

పురుషుడు : ఆఁ ఆఁ!

తాత : ఒక్క తాపసి మనసు నొచ్చి
ఒక్క దినమొల తబిసి వచ్చి

స్త్రీలు : వచ్చి ? ఆఁ ఆఁ!

తాత : సత్త్వ మన సంజ కెంజాయా.........
అసత్యం!
అర్థ మనగా వట్టి మాయ........
అనర్థం !
అర్థమూ, సత్యమూ అఖిల విశ్వమ్ము నకు
శ్రేయ మొసగిన గాని చెల్లవూ,
ఎవ్వరును ఒల్లరూ
చాలు చాల్!

స్త్రీ, పురుషుడు : అవునూ! ఊఁ ఊఁ

తాత : శ్రీ శైల కైలాస శేషాచలము లన్న
మేను లలతులు గాని మిన్న లన్నిటి కన్న
అన్న సత్యము నిరూపించె
అరుణ రథమును సాగబంచె!
అదుగో, ఇంక మీరే చూడండి జరిగిన దంతా.
అదిగో వింధ్య పర్వతం దగ్గిరకి నారదుడు వస్తు
న్నాడు.

* * *

వింధ్య : విజయం చేయండి. ఇటు దేవర్షీ! తమ పాదా
లకు నమస్కరిస్తున్నాను. ఈ కనకపీఠం మీద
దయచేయండి.

నారదుడు : అద్రి రాజా! సంతోషం.

వింధ్య : తమరు మహాత్ములు. తమ కృపావాహినిలో నా రజః ప్రసరం అడగిపోయింది. తమ మందహాస కాంతుల్లో నా తమః కాండం నశించి పోయింది. నేను కృతార్థుణ్ణి. ధన్యుణ్ణి. భాగ్యవంతుణ్ణి.

నారదుడు : మాకు చాలా ఆనందం కలిగింది. వింధ్యాచల రాజా! నీ చూపుల్లో మాకేదో తొందర గోచ రిస్తూంది. పర్వత సమ్రాట్టువు. మా వల్ల తెలిసికొనవలసిన విశేషం ఏదయినా ఉందా?

వింధ్య : చిత్తం, ఒక్క విన్నపం అవధరించండి. ఈ భూమండలంలో తాము చూడని కొండలు లేవు. ఈ భూచక్రాన్నంతా నా లాగు భరించగలిగి, నాకు ఈడు జోడైన పర్వతం మరొక్కటుందా? క్రౌంచం, గంధమాదనం, మలయం, హేమ కూటం అన్నిటినీ ఎరుగుదును. వాటి పేరు పెంపులు నే నెరగనివి కావు. నాకు శత్రువు మేరు శైల మొక్కటే! మా ఇద్దరి తారతమ్యం తమ రెరుగుదురు. పక్షపాతం వదలి తమ రానతీయాలి.

[నారదుడు నిట్టూరుస్తాడు]

వింధ్య : తమరు మౌనంగా ఉండడం నాకు మరీ తొందర కలిగిస్తూంది, ఈ చింతా జ్వరం నాకు నిద్ర లేకుండా చేస్తూంది. ఏ సుఖాలూ, ఏ వైభవాలూ నా మనస్సుకు పట్టడం లేదు.

నారదుడు : అద్రిరాజా! శ్రీ శైలాది పర్వతాలు మీ ఇద్దరి కన్న మాహాత్మ్యంలో చాలా గొప్పవి.

వింధ్య : అలాగ సెలవివ్వకండి మహాత్మా! మేరువే నాకు శత్రువు. నాకు రెక్కలే ఉన్నట్లయితే, ఒక్కసారి

ఆకాశంలోనికి ఎగిరి, తను నుగ్గూ నుసీ అయ్యే-టట్లు మేరు పర్వతం మీద దూకి ఉందును.

నారదుడు : వింధ్యరాజా! నువ్విప్పుడు ప్రశ్నించినట్లే మేరువు కూడా మమ్ము ప్రశ్నించాడు. నీ లావు నీకు తెలుసు. అతని ప్రభావం అతనికి తెలుసు. మీ ఇద్దరి తారతమ్యం ఎంతవా రయినా తెలుసుకోలేరు. అయినా మేరువే నీకన్న కొంత అధికుడేమో! అయినా తీర్థయాత్రా పారీణులకు మాకీ ఆలోచన లెందుకు? నేను పోయి వస్తా!

[నారదుడు వెళ్లిపోతాడు]

వింధ్య : విలుధ ముని మాట వెవికి క్రొవ్వేడియయ్యె
సైపజాలని దయ్యె ఈర్ష్యానలమ్ము,
అడ్డు పెట్టెద గాక తీవ్రాంశురథము
ప్రహరి తిరుగకయుండంగ భర్మగిరికి

[ఒక్క చిటిక నిశ్శబ్దం]

* * *

తాత : అది గదిగో, అటు చూడండి. వింధ్య పర్వత రాజు మేఘ మండలమూ, తారా మండలమూ, సూర్య మండలమూ దాటి ఎలాగ పెరిగిపోతున్నాడో! ఈశ్వరుడు లింగాకారుడై అవరోధించినట్లు, బలి దైత్య ధ్వంసి నారాయణుడవరోధించినట్లు అరుణ రథాన్ని ఎంత దర్పంతో ఆటంక పరుస్తున్నాడో! అయ్యో! లోకాలు చీకటిలో మునిగిపోతున్నాయి. అయ్యయ్యో! జగత్ప్రాణ మూర్తి పాషాణంలాగ బరువెక్కి కదలలేక పోతున్నాడు. అబ్బ! చరాచర వస్తువులన్నీ మంచుగడ్డల్లాగ పేరు కొని పోతున్నాయి.

"లేవయ్యె స్వాహా స్వధా వషట్కారంబు
ఉడివోయె త్రేతాగ్నిహోత్ర విధులు
కాలంబు కొలది లెక్కలు వెట్టనేరక
చిత్రగుప్తాదులు చిక్కువడిరి
ఇది సంజ ఇది రాత్రి ఇది వాసరం బను
సమయ వర్తము లపక్రమము లయ్యె
స్వాతితో వర్షంబు సమకూరకుండుట
పంట లేబర మయ్యె పాడితోడ
కొన్ని దేశంబు లెండచే గొనరువోయె
కొన్నిదేశంబు లివముచే కొంకువోయె
కొన్నిదేశంబు లిరులచే గుత్తిపడియె
కొన్నిదేశంబు లివచేత కుంకబడియె"

పాపం అటువినండి, ఆ దీనాలాపాల్ని. కంఠ రవాలు కదలక గడ్డ కట్టుకు పోతే, ఎలాగ మొరపెట్టుకోగలరు సూర్యభగవానునికీ?

ఒక గొంతు : ఒకసారి నీవు రావోయి స్వామీ! భవ
మ్మంత క్రుంగిన దురంధాంధువయ్యె

వేరొక గొంతు : ఎపుడు వత్తువో జీవితేశ్వరా! ఇల్లెల్ల
ధూళిలో రాలు కంకాళ మయ్యె

మరొక గొంతు : దయచేయవా దయోదార పారావార
నాడు నాడొక వల్లకాడె యయ్యె

ఇంకొక గొంతు : వేంచేయవేల? ప్రపంచావనా! లోక
పటలి మృత్యువుకు నేపథ్య మయ్యె
ఈసులని, ఆసలని మదియించి మేను
పెంచి, కల్పించిరీ అకాల విలయ వేళ

మేరు శైలమ్ము వింధ్య భూమీధరమ్ము
ఏ తపసి మమ్ము నేడు రక్షించువాడు?

[సంగీతం]

* * *

[కాశీ మహాక్షేత్రం. ఉపాంతమున అగస్త్య మహర్షి ఆశ్రమం. లోపాముద్రా దేవితో మహర్షి ఏదో అనతిస్తున్నాడు.]

లోపాముద్ర : ఈ వింధ్య పర్వత రాజు లోకాని కెట్టి మహాపద కలిగించాడు? ఈ విలయం దాటి ఈ జగత్తు బైట పడాలి గదా!

అగస్త్యుడు : ఇంతకన్న మత్తులూ, జగత్ప్రళయ కారకులూ ఇంతకు ముందు రూపులేకుండా పోలేదూ?

లోపాముద్ర : ఏమో! లోక బాంధవుడైన భగవానుని రథ గమనానికే అడ్డు వచ్చిన వానిని ఏ దేవత లేం జేయగలరు? కొండలకు మెత్తని రెక్క లున్న ప్పుడు దేవేంద్రుడు వాటిని నరక గలిగాడు. కాని, ఇప్పుడు నాక లోకాన్ని కూడా అతిశయించిన వింధ్యాన్ని తానేమి చేయగలడు?

అగస్త్యుడు : దేవేంద్రుని శక్తి కూడా త్రిలోక రాజ్యాధిపత్యం వల్ల కలిగిన అహంకారం వల్ల కొరత పడి పోయింది. వింధ్య గర్వం అణచడానికి కావలసిన శక్తి వేరు.

లోపాముద్ర : తపశ్శక్తి!

అగస్త్యుడు : పరమ శివుని అనుగ్రహం. దేవీ! ఈ వారణాసి భూలోక మధ్యాన ఉన్న స్వర్గ ఖండం. ఏ మహాప్రళయమూ ఈ కాశికి తగలదు. ఈ

ఆనంద కాననంలో ఉన్న మనం, పాపం లోక మంతా ఏ భయంకర వేదనలో నలగి పోతూందో గ్రహించం. ఏ తపస్వి అయినా కదలి వెళ్లి వింధ్య మత్తత అణగిస్తే?

లోపాముద్ర : పరమ మాహేశ్వరు లయిన తమరే కరుణించక పోతే - అవును వదలడం కష్టం, ఈ మణి కర్ణికా తీర్థమూ -

అగస్త్యుడు : బాహ్య తీర్థాలలో ఏముంది? పరమ శివుడు నిత్యమూ వేంచేసి ఉన్న మనస్సులో ఉన్నది దివ్య తీర్థం. రుషు లేమన్నారు? 'సత్యము తీర్థము, ఇంద్రియనిగ్రహము తీర్థము, అనుకంప తీర్థము, ధృతీ, సమతా, విజ్ఞానమూ ఇవన్నీ తీర్థాలు' అని. పరమ శివులు ఆనతిస్తే కాశినే ఎడబాసి పోగలం.

(దూరం నుంచి పిలుపులాగ "అగస్త్య మహర్షీ!")

అగస్త్యుడు : ఎవరది? ఎవరిదా కంఠధ్వని?

కంఠం : అగస్త్య మహర్షీ! లోకాలకు ఇట్టి బాధలు కలిగి నప్పుడు ఈ కాశిలో నిశ్చలంగా కూర్చుని నీవేమి చేస్తున్నావు? పరమ శివుల ఆనతి అయి నది. లోపాముద్రా దేవితో కదలిపోయి నీవు వింధ్యాచలం గర్వ నాశనం చెయ్యి. అగస్త్యా! నీవు సాక్షాచ్ఛివ రూపుడవు. నీవు ప్రణవమవు. లోపాముద్రా దేవి ఆమ్నాయ విద్య. నీవు తపస్సువు. ఆ అమ్మ శాంతి. నీవు ఫలమవు, ఆ తల్లి సత్క్రియ. నీవు సూర్యుడవు, ఆ జనని చైతన్యలక్ష్మి. దివ్య ధంపతులు మీరు. ఆది

కాలాల నుండి లోకాలను కాపాడుతూ వచ్చిన పార్వతీ పరమేశ్వరులే! తరలండి. లోకాలు పూర్తిగా నాశనం కాకుండానే బయలుదేరండి!

అగస్త్యుడు : ఈ దివ్యవాణి ద్వారా పరమశివులే ఆనతిస్తున్నారు. దేవీ,లే! అమ్మా గంగమ్మా, పోయిరానా? డుంఠి విఘ్నేశ్వరా! కేశవ స్వామీ! సెలవిస్తారా? భైరవదేవా! మరలి వస్తానయ్యా! నా తండ్రీ, విశ్వేశ్వర మహాదేవా! నను గన్న తల్లీ, విశాలాక్షీ! మమ్ము దీవించి పంపండి.

* * *

వింధ్య : ఎవరది? అంత నిర్భయంగా వస్తున్నాడు. అంత బడుగు శరీరమూ ఎంత దుర్నిరీక్ష్య తేజంతో వెలుగుతూంది! అటు ఆ చరియలమీద చిక్కుపడిన రథంలో దిగబడి సూర్యుడే ఉంటే, ఇటు ఈ బక్కతపసి వేయి సూర్యమండలాల్లాగ ధగధగలాడుతున్నాడు. అప్రయత్నంగా నా శిరస్సులు వంగి పోతున్నాయి. శరీరం కుంచించుకొని పోతున్నది. మహర్షీ! నేలమీద శిరస్సు వంచి నీకు వింధ్యాచలరాజు నమస్కరిస్తున్నాడు.

అగస్త్యుడు : అచలరాజా! మాకు సంతోషం. ఈ అడకువ చూపించి ఇప్పుడు కొండలలో కెల్ల ఉద్దండుడవైనావు. మా మాటలు విను. మేరువు అర్థ మత్తుడు. నీవు దుష్టసత్త్వ మత్తుడవు. ఇద్దరూ స్వార్థ పరాయణులు. స్వార్థంవల్ల అహంకారం, దానివల్ల క్రౌర్యం, దాని వల్ల నాశం, లోక విలయం సంభవిస్తాయి. ప్రేమార్ద్రిములైన అర్థ, సత్త్వాలు లోకానికి మంగళప్రదాలు. చూడు, నీ అడకువ

జగత్తుకు ఎంత శివంకర మైనదో! ఎప్పుడూ నీ శిరస్సు నిట్లే వంచి అడకువతో ఉండవయ్యా!

తాత : ఆహాహా! చూశారా! అదుగో. అనూరుడు పాశాలను బిగబట్టి వెనక్కి ఒరుగుతున్నాడు. సప్తాశ్వాలూ మెడ లెత్తుతున్నాయి. అరుణరథం కదులుతూంది. ఆహా! కేతనం మీద బంగారు గంటల మ్రోత! గాలి తల లూపుతూ పాడుతూ నడుస్తూంది.

[బృందగీతి, పురుషులూ, స్త్రీలూ కలిసి]

*ఔనా! ఇది అరుణోదయ*
*మేనా! ఈ నాటికైన-*
*ఏటికి పారును చీకటి*
*గూటికో గుహకో గానీ! .....ఔనా!*

*అరరే, అరె! పొడుపు కొండ*
*చరియ రాల నెగబ్రాకును!*
*కర కర కర త్వర త్వరగా*
*అరుణ రథ తురంగ రింఖ .....ఔనా!*

*చూడు! చూడు! ఉదయశైల*
*చూడా మాణిక్య రోచి,*
*ప్రాచీ వన చామీకర*
*వల్లిక లల్లు! .....ఔనా!*

*సరి! సరి! విను! విను వాటుల*
*స్వచ్ఛంద మధు ఛ్ఛందము*
*లీ ఖగోళ కంఠమాల*
*ఏల పాడునమ్మా .....ఔనా!*

హోయి! హోయి! కాలు వేయి
ఆడించును చల్లగాలి!
ఈ అయత్న చామరములు
ఎక్కడి వమ్మా! .....ఔనా!

దేవతలు : నమో నమస్తే నారాయణ! నవ
జీవనిధానా! నమో! నమో!
అంధకార వారణ దారణ చణ
కిరణ కృపాణా! నమో! నమో!

లోకప్రజ : ఎన్నాళ్ల కెన్నాళ్ల కీ కన్ను దామరల్
వికసింపగా నిన్ను వీక్షించినా మయ్యా!
మత్త భూభృత్సమాయత్త దాస్య తమస్సు
మిత్తియై లోకాల మ్రింగి వేయకమున్న
విన్నుపై, ఉదయాద్రి తిన్నెపై, వెలసినా
వెన్నాళ్ల కెన్నాళ్లకు!

దేవతలు : గ్రహ తారా నీహార మయూఖా
ఖండ మండలేశ్వరా, నమస్తే!
ఇహ పర లోకాంతరాళ నిశ్రే
ణీకృత బహుళ కరా! నమస్తే!

లోకప్రజ : దేవదేవా! నీకు త్రోవచూపుచు ఉషో
దేవి ముందర నడువగా,
ఎగసి ఉదయాద్రిపై ఏడు బాబాల తే
రెక్కి ధగధగ మెరయగా - నీమూర్తి
నిక్కించి తలల, నిను వీక్షించి, లోకాలు
మ్రొక్కుకొను టెన్నాళ్లకు!
ఎన్నాళ్ల కెన్నాళ్లకు!
అత్తమిల్లిన కనుల అల్లుకొన్నవి నేడు
క్రొత్త చూపుల తీగలు!

సత్తు వెడలిన మేన సందడించుచు పాడు
క్రొత్త నెత్తురు వాగులు!
ఆ తపస్వాలి, మాపాలి పెన్నిధి, దయా
శీతవారిధి క్షమాశేవధి కటాక్షించి
రక్షించె మమ్ము సాక్షాత్కరించితి వీవు
ఎన్నాళ్ల కెన్నాళ్లకు!

దేవతలు : కమల వనప్రియ! విమల విష్ణు పద
వీథీపథికా! నమో నమస్తే!
కుటిల పాశ విక్లేశ విమోచన!
లోకలోచనా! నమో నమస్తే!

సప్త తురంగమ! తప్తకాంచన
చ్ఛాయా! ఛాయావరా! నమస్తే!
సుప్త జంగమ స్థావర నూతన
చైతన్య వరాధార! నమస్తే!

లోకప్రజ : నీవు --
దూర మనగా, అంధకార మనగా, జర
భార మనగా, యమద్వార తోరణమౌను:

నీవు--

చేరువన, చేవయన, శ్రీయన, సమృద్ధియన
శక్తి యన ముక్తి యన నొక్కటే!
దాస్య దురిత ధ్వాంత గహన దవ దహన! పే
గగన మణిదీపమా! భువన భువనావనా!
ఎన్నాళ్ల కెన్నాళ్లకు!

దేవతలు : కిరణకశా త్రస్తాంధ నిశా!
తరుణ జీవ నోచ్ఛ్వలిత రసా!

ఓ తమోఘ్న! ఓహో హిమఘ్న! ఓ
హోహో కృతఘ్నఘ్నా! నమస్తే

కవి : చాత శ్యామా లతాయా:
పరశు రివ తమో౽ రణ్య వహ్నే రివార్చిః
ప్రాచ్యైవాగ్రే గ్రహీతుం
గ్రహ కుముదవనం ద్రాగుదస్తాగ్ర హస్తః
ఐక్యం భిందన్ ద్యు భూమ్యో
రవధి రివ విధాతేవ విశ్వప్రబోధం
వాహోనాం వో వినేతా
వ్యపనయతు విపన్నాక లోకాధిపస్య

ఆకాశవాణి మద్రాసు కేంద్రం నుండి ప్రసారితం
*25-1-1950*

# జమదగ్ని

స్వార్థమ్ము కల్పాంత సమయాంధ్యమై మృత్యు
వై జగత్సంక్షోభమై విలయ నాశమై
వికృత వక్త్రము తెరచి విహరించు నపుడెల్ల
ఏ యుదగ్రాగ్రహ మ్మో యుదాత్తావేశ
మడరింప నడిపింప, జడము చైతన్యమై
పురుగు నరుడై, నరు డమరుడై, మహీభువన
మధ్యమున నూత్నయుగ మంగళమహోదయము
సాధింపజాలు సంస్థాపింప జాలునో,
ఆ ధాత్రి ఆ నేత్రి ఆ నిత్య శుభదాత్రి
ఆ మహాశక్తి మి మ్మావహించును గాత!

# మొదటి రంగము

(జమదగ్ని ఆశ్రమోపాంతాన. మహర్షి శిష్యులు గాలవుడూ, గౌతముడూ. రెండు జాముల ప్రొద్దెక్కుతుంది)

గాలవుడు : మేలుకొనడం మాత్రం, పాపం, తెల్లవారక మునుపే జరుగుతుంది. ఒళ్ళు మాత్రం ఏ తరు మూలాన్నో ఆశ్రయించి ఒరుగుతుంది. ప్రతి నిర్భాగ్యుడూ బ్రహ్మాండమైనంత తపస్సు చేయాలాయెను!

గౌతముడు : గాలవా! నీ అపహాస్యానికి అంతులేదు. భార్గవులు పరిహాస పాత్రులు గారు. ఊరుకో!

గాలవుడు : ను వ్వూరుకో!

గీ. ఒకడు తపమని, జపమని యొక, డొకండు
యాగమని యజ్ఞ మనియు భిక్షాటనమని
తర తరమ్ముల సోమరితనము ప్రాపు
గాగ, బ్రతుకీడ్చుచుంద్రు భార్గవులు నేడు.

గౌతముడు : జమదగ్ని మహర్షులు భార్గవులు కారా?

గాలవుడు : గౌతమా! నేను గురుదేవుల నధిక్షేపించను. కాని వారి తపస్సు కూడా యేమంత పరి పక్వమైనదయ్యా? రేణుకా దేవిని కుట్టలేక పోయింది.

గౌతముడు : ఆఁ, ఆఁ, ఆ మాటనకు. నోరుముయ్!

గాలవుడు : నా నోరుమూస్తే లోకం నోరు మూయవద్దూ? ఎవరి నోరు మూసినా, నీ నోరు ముయ్య బడదు. ఆశ్రమ మంత ఉంది నీ ఆస్య గహ్వారం. దాని విస్తీర్ణమూ, పరాక్రమమూ భోజనశాలలో చూడాలి. ఇంతకూ రేణుకాదేవిని నే నేమీ

అనను. ఆ అమ్మ మానవ మాత్రురాలే గాని సన్యాసిని కాదు గదా! ఆమె ఇంకా నీలాకాశం లో నివాసం ఏర్పరచుకోలేదు. సంయము లామెను సాధించడం, శపించడం తప్పు!

గౌతముడు : ఓరి నీకూతలు కూలా. అన్నన్నా! అన్నన్నా! నీకూ ఆ శాపం తగలాలిరా.

గాలవుడు : నలుగురూ కలిసి తగిలించండోయి ఒకటి. రాయినో, రప్పనో అయి కూర్చుంటాను. రాయైనా నయమే వాళ్లకన్నా.

గౌతముడు : ఎవళ్ల కన్న?

గాలవుడు : చూడు, ఆ రావి చెట్టుకింద రుమణ్వంతుణ్ణి. అబ్బ! ఎంత పేరోయి. ఎవరికేనా గుండె కింద నుంచి కుండబొజ్జ ఉండడం ఎరుగుదును కాని గళం కింద నుంచీ గంగాళ ముండడం ఎరగను.

గౌతముడు : తప్పురా !

గాలవుడు : తప్పు గాదురా, పప్పు. ప ప్పదంతా! చూడు, చూడు, ఆ చూత మూలాన సుషేణుణ్ణి. ఇరవై యేళ్లు లేవు గురుకుమారులకి, గడ్డివామంత గెడ్డం పెంచాడు. ఉత్తప్పుడు నోరు దర్శన మివ్వదు. అరటాకు దగ్గర అహోబిలమంత సాక్షాత్కరిస్తుంది!

గౌతముడు : నువ్వు భోజనం చెయ్యవేం?

గాలవుడు : (వెటకారంగా) నువ్వు భోజనం చెయ్యావేం? నేను దంచేస్తాను. నేను తిండికే పుట్టాను. అయ్యో! వసు మహర్షి గారూ, కొంపదీసి కళ్లు తెరవ కండి. బూడిదై పోతాం. ఎదురుగుండా ఏడిశా మాయెను. హైహయుల మీద ప్రసరింపవలసిన వీక్షణానలం అమాయకుడిమీద రగిలించకండి. ఏమి చిరునవ్వురా?

గౌతముడు : ఎవరిదిరా ?

గాలవుడు : ఆ వేదిక మీది విశ్వావసువుది. ఎందుకురా అంత తియ్యగా నమ్మకంగా చిరునవ్వు నవ్వుకుంటూం టాడు? ఆదేమి టస్తమానమూ అరికాలి కేసి అలా చూసుకుంటాడు? అదీ, భృగుమహర్షి - ఈతని తాత తాత తాత - ఆయనకే కాబోలు అరికాలులో కన్నవతరించింది. (వెటకారంగా) ఓ విశ్వావసూ, తాపసోత్తమా! సంయమి సమ్రాట్టూ! మహర్షి మూర్ధన్యా! తమ అరికాలులో కనుదమ్మి వికసించలేదు. అరకేలిలో ముక్కు మొలి చింది. కడుపుపై కడుపు నిలిచింది. ఆ వింధ్య పర్వతశ్రేణి వంటి వాడవు! యోగనిద్రలో పడు మహాత్మా, యోగనిద్ర. హైహయులు వచ్చిపడితే నీకేం? అచ్చంగా వాళ్లనే భోంచెయ్యవచ్చు.

గౌతముడు : గాలవా! ఇక సహించలేను నీ మాటలనీ, గురుధిక్కారాన్నీ.

గాలవుడు : (ఆగ్రహంగా) సహింపక?

గౌతముడు : గాలవా! పది సంవత్సరాల గురుకులవాసం నీకు పనికి వచ్చింది కాదు. ఇన్ని వేదశాస్త్రాలు

చదివావు ఇందుకా, ఏడవడానికా? ఏమిటయ్యా యిది? తర తరాల తపస్వుల గాథలు సృష్ట్యాది నుండీ వినబడుతూ వచ్చినవి. నీకు వినబడవా? నచ్చవా?

గాలవుడు : నాకు ప్రత్యక్షంగా కనబడేదాకా నచ్చవు. అన్ని ఆశ్రమాలూ హైహయులు ఆహుతి పుచ్చు కున్నారు. అందరు తపస్వులూ అఖండ యోగ నిద్రలోనే మునిగిపోయారా? ఏదీ, ఒక గడ్డి పరక మంత్రించి ఏ గారు డాస్త్రమో చేయలేక పోయారా?

గౌతముడు : తరుణం వచ్చినప్పుడు చెయ్యనూ చేస్తారు.

గాలవుడు : (వెటకారంగా) చేస్తారు. చేస్తారు. ఉదయాన్నే గోమయం చేస్తారు. అఘమర్షణ స్నానం చేస్తారు. సంధ్యావందన మని సందడి చేస్తారు. భోం చేస్తారు. మిగిలిని వన్నీ యథావిధిగా సమ యానుకూలంగా చేస్తారు. అవేవో తెలిసిందా?

(దూరాన్నుంచి కిలకిల నవ్వుతున్నట్లు ఆడ గొంతులు)

గౌతముడు : అరుగో! సత్యవతీ, ప్రియంవదా వాళ్లూ. ప్రియం వద కూడా సరిగ్గా నీకు సరిపోయిందే! నీ కూతల వంటివే యేవో కూస్తోంది అక్కడ. ఆశ్రమంలో ఈ అసంతృప్తి పనికిరాదు.

గాలవుడు : కొంతకాలం ఈ ఆశ్రమం అనే మాట విన బడకపోతే బాగుండును. (వెటకారంగా) ఏమి ఆశ్రమాలూ? ఏమి ముని వృషభులు?

గీ. అమరి తీరు సకాలమ్ము నంద తనకు
బూరెతో, గారెతో దివ్య భోజనమ్ము,
పూర్వ కర్మమ్ము మేరువువోలె తన్ను
పట్టి యుండుట వలన, తపస్సువలన

అని ఒకమునీశ్వరుడున్నా - (ఈ వచనం కూడా రాగంతోనే అనాలి)

గౌతముడు : ప్రియంవద దగ్గిరగా వస్తే చాలు, ఎన్ని పద్యాల్లోకి, పాటల్లోకేనా దిగుతావు.

గాలవుడు : దిగను. ఎక్కుతాను.

గౌతముడు : ఆవిడగారి దగ్గర మెరవాలని కాదురా మరి?

గాలవుడు : నువ్వు ఎవరి దగ్గరా మెరవలేవు కాదురా? దద్దమ్మా!

ఆ.వె. రేయి రేయి కాన హాయిగా నిస్స్వప్న
నిశ్చలమ్ము గాఢనిద్ర యయ్యె
పవలు సాల మూల పర్ణ వితర్దిక
సాక్కి సోలి యోగ సుప్తి యయ్యె

* * *

## రెండవ రంగము

కార్త : ప్రవరసేనా! నీ కార్తవీర్యం అవిశ్రాంతమూ, అప్రతిహతమూ అయిన ప్రచారం. హైహయ జాతి జగత్తులో కంతా ఉత్తమమైన జాతి అనిన్నీ, ఆ అమూల్యరక్తం దేహనాళాల్లో ప్రవహించే ప్రతి హైహయుడున్నూ లోకశాసకుడుగా ఉండడానికి అర్హుడనిన్నీ, ఉండి తీరాలనిన్నీ, ఈ కార్తవీర్యార్జునుడు హైహయ జాత్యుద్ధరణకు అవతరించిన మహానాయకుడనిన్నీ ప్రజలలో అహోరాత్రాలూ ప్రకటన చేస్తూనే ఉండాలి. ఇతర రాజ్యాలలో వారికి మన రాజ్యంలో సౌఖ్యమూ, శాంతీ, సంపదలూ సర్వ జనులకూ సమృద్ధిగా ఉండడం వల్ల మన పరిపాలన అంటే మక్కువగా ఉన్నట్లూ, అందరూ సంతృప్తిగా ఉన్నట్లూ అదే పనిగా తెలియజేస్తూ ఉండాలి. ఇతర రాజ్యాల్ని భయపెడుతూ ఉండాలి. బుజ్జగిస్తూండాలి. మన రాజనీతి వారికి విస్పష్టంగా విశదం కాకూడదు.

ప్రవర : చిత్తము.

కార్త : ప్రవరసేనా! నీ పని సామాన్యమయినది కాదు. సమీప రాజ్యం మీద హైహయసేనలు పడే వరకూ ఆప్తులమే అని దానికి విశ్వాస ముండే టట్లు నీ ప్రచారం సాగాలి.

ప్రవర : చిత్తం, గ్రహించాను.

కార్త : ఉద్దండా! నీకు నిద్ర ఉండదు. విశ్రాంతి లేదు. హైహయుల గూఢచారి వర్గము వంటిది అఖిల

జగత్తులో ఉండకూడదు. అన్ని దేశాలలో అల ముకొనే ఉండాలి అది. జయించిన రాజ్యాలలో మరీ జాగరూకతతో ఉండాలి.

ఉద్దండుడు : చిత్తము.

కార్త : మన రాజ్యంలో ఎక్కడ అసంతృప్తి గాని కుట్ర గాని వడిదుడుకు గాని కనుపడినా, అక్కడ శిరస్సులు ఎగరవలసిందే. ప్రజలకు మాత్రం వారు దేశద్రోహులనీ, హైహయులు కారనీ ప్రవర సేనుడు ప్రకటిస్తూనే ఉంటాడు.

ఉద్దండుడు : చిత్తం, మహాప్రభూ!

కార్త : అంతేకాదు. మేము రాజమందిరం వదలి బయలు దేరు నప్పు డెప్పుడూ రాజవీథిలో ఒక్కొక్క మానవునికి ఒక్కొక్క గూఢచారి చొప్పున అంటి పెట్టుకుని ఉండాలి.

ఉద్దండుడు : చిత్తం.

కార్త : (ప్రళయంగా నవ్వుతూ) హహహ. హహహ, అంతే కూడా కాదు, హ్హ హ్హ హ్హ హ్హ.

అందరూ : హ్హ హ్హ హ్హ హ్హ.

కార్త : (కఠినంగా) నేనేమి చెప్పబోతున్నానో వినకుండా నవ్వకండి. నవ్వద్దు.

అంతా : (బిగ్గరగా) చిత్తము.

కార్త : హ హ్హ హ్హ (నవ్వుతూ) నా పోలిక వాళ్లని నలుగురు హైహయుల్ని జాగ్రత్త చేయండి. (మళ్లీ నవ్వుతాడు) మే మవసరం లేని సమయాల్లో ప్రజలముందు వాళ్లని ప్రదర్శిస్తూండాలి.

అందరు : చిత్తం, చిత్తం. బాగుంది. హహ్హ హహ్హ (నవ్వు

కార్త : శూరా! ఈ ఐశ్వర్య క్షుధా, సామ్రాజ్య తృష్ణా, మన ఒక్కరి రోగమే కాదు. లోక మంతా అనేక రూపాల్లో అతిశయించి ఉంది. మనం హైహ యులం. మనదే యింక సామ్రాజ్యము. ఈ సందేశం మనస్సుల్లో సుస్థాపితం చేసుకోండి. మన పరిపాలనా యంత్రం వంటిది వేరొకటి ఉండకూడదు.

అందరు : జయము! కార్తవీర్య సార్వభౌమునకు జయము!!

* * *

## మూడవ రంగము

[సంధ్యా సమయం. జమదగ్ని ఆశ్రమం. రేణుకా, సత్యవతీ, ప్రియంవద, గాలవుడు, గౌతముడు]

రేణుక : నా కేదో భయంగా ఉంది. లోపల స్తిమితంగా లేదు.

గాలవుడు : భయంగా ఉండదమ్మా?

గౌతముడు : మనకు భయ మెందు కంటాను. జమదగ్ని మహర్షి ఆశ్రమం అని తెలియగానే....

ప్రియంవద : తెలియగానే?

గౌతముడు : ఆశ్రమ సమీపానికేనా హైహయుడు రావడానికి వెరుస్తాడు.

గాలవుడు : నేను నమ్మను. వెరవడు వాడు.

గౌతముడు : నీకు తపోబలం సంగతి తెలియదు. అంతే కాదు, గురుదేవులు కరుణా మూర్తులు. కరుణ కెంత ప్రభావం ఉందనుకున్నావు!

గాలవుడు, ప్రియంవద : ఇంత [అని నవ్వుతారు]

గౌతముడు : కరుణ పూర్ణిమా జ్యోత్స్నలాగ, క్షీరసాగరంలాగ ముంచెత్తి వేస్తుంది లోకాన్ని.

గాలవుడు : అంతే, ఏమనుకున్నావు? ఇదంతా మేమూ పఠించామయ్యా.

ప్రియంవద : వెయ్యి సారులు విన్నాం - దాని మహత్యాన్ని గురించి.

గౌతముడు : హింసకూ, క్రౌర్యానికీ ప్రారంభిస్తే అంతం ఉండదు. అంతే కాక, హింసకు మించిన హింసా, క్రౌర్యానికి మించిన క్రౌర్యమూ బయలుదేరుతూనే ఉంటాయి.

గాలవుడు : అంతే కాక -

గౌతముడు : అంతే కాక, అవి ఎప్పటి కయినా బలహీనమై పరాభవింపబడి తీరుతాయి.

గాలవుడు : ఇప్పుడు మాత్రం చంపుతున్నాయి. ఎప్పటి కయినా అన్నది తరువాత చూద్దాం!

రేణుక : రాము డాశ్రమంలో లేడు.

ప్రియంవద : హైహయులు గుర్రాలమీదనే వస్తారుట కాదూ?

గాలవుడు : ఔను .... హైహయులంత రౌతులు లేరు. ఇప్పుడు నర్మదా తీరాన్నుంటారు, రేపు పాంచాలంలో ఉంటారు. వాడు ప్రతి వాడూ యోధుడే!

రేణుక : వాళ్లను జయించే వాళ్లే లేరుట కాదూ?

గాలవుడు : వాడు సంహారం కోసం ఎప్పుడో సర్వ సన్నాహాలూ చేసి బైలుదేరినవాడు. శస్త్రాస్త్ర ప్రయోగంలో వాడంత నిపుణుడు లేడు. వాడి విజిగీషకి అంతు లేదు. మన అసమర్థతకీ అంతులేదు.

రేణుక : నాకు చాలా భయంగా ఉంది. రాము డాశ్రమంలో ఉంటే బాగుండును.

గౌతముడు : గురువు గారికి తెలిసినట్టు ఇప్పుడీ లోకంలో ధనుర్విద్య యెవరికీ తెలియదు. అస్త్ర విద్యకి అంతు చూశారు వారున్నూ.

రేణుక : రాముడు మునికుమారులు కొందరికి సమరశిక్ష యిచ్చాడట కాదూ?

గాలవుడు : వాళ్ళూ రాముడి తోటే వెళ్ళారు.

రేణుక : రాముడికి వార్త పంపుతే?

గాలవుడు : ఎక్కడి కనమ్మా? ఎవరు వెడతారు?

గౌతముడు : ఇప్ప డీ ఆశ్రమం ఎవరు విడిచి వెడతారు?

గాలవుడు : ఇప్పుడు వీ రందరూ ఉండి ఏం చేస్తారు?

[దూరాన గుర్రాల గిట్టల చప్పుడు]

రేణుక : అది గుర్రపు డెక్కల చప్పుడు కాదూ?

గాలవుడు : అలాగే తోస్తూంది. నెల దినా లయింది హైహయులు మైత్రావరుణుని ఆశ్రమం ధ్వంసం చేసి. పాప మా వృద్ధర్షిని కూడా చంపారట.

రేణుక : వారి కుటీరం లోనికి వెడదాం.

గౌతముడు : అది మంచి పని, అందరమూ గురుదేవుల పర్ణ శాల వద్దనే ఉంటే మంచిది. ఆలమంద వారి కుటీరానికి వెనుక వైపుననే ఉంది కదా!

గాలవుడు : కుటీరానికి వెనుక వైపేమిటి? ముందేమిటి? నీ మొహం. కుటీరం గొప్ప దుర్గమా? అటు వైపునుంచి రాకూడదూ వాళ్ళు? ఇంతకూ వాళ్లు మహర్షి దర్శనానికి వస్తున్నారా? ధ్వంసం చెయ్యడానికి వస్తున్నారా? ఆశ్రమ సౌందర్యం అంతా ఆస్వాదించి, ఆ శాంతి లోపలకు పీల్చు కుని, తరువాత గురుదేవ సన్నిధికి రావడానికి వాళ్ళేం తాపసులూ, భక్తులూనా?

రేణుక : ఎంత శాంతిగా ఉండేది ఈ సమయాల్లో ఆశ్రమం! ఆలమందలు నెమరు వేసుకుంటూ బ్రహ్మ చారు- లతో ఇంటికి వస్తూండేవి. ఆ మైదానం మీద నుంచి ఆ తోపులోకి ఇప్పుడే ప్రవేశిస్తూండేవి. ఇవ్వాళ త్వరగా వచ్చేశాయి.

గాలవుడు : నేను తోలుకుని వచ్చేశానమ్మా!

ప్రియంవద : అందరూ ఏదో భయంగా చిదికి పోయినట్లు న్నారు. కుటీరాల చూరుల్లోంచి కూడా చల్లగా శాంతి కురుస్తున్న ట్లుండేది. ఇవాళ ఆశ్రమం దిగులుగా నక్కి నక్కి చూస్తున్న ట్లుంది, ఊపిరి వదలకుండా. పాపం, సత్యవతి లేడి ఆలమం దల్లో నక్కింది. ఇవాళ హోమాలు ఆపితే బాగుండును.

గౌతముడు : తప్పు, తప్పు.

ప్రియంవద : హోమధూమం చిత్రంగా పెద్ద నీలి లత లాగ ఆకాశంలోకి పాకిపోతుంది. తలాడిస్తూంది - దూరాన్నుంచి పిలుస్తున్నట్లు.

[దూరాన గిట్టల చప్పుడు.]

రేణుక : ఎలాగ?

ప్రియంవద : ఎలాగ?

రేణుక : గాలవా! మైత్రావరుణుని ఆశ్రమంలో ఏం చేశారు వాళ్లు?

గాలవుడు : సర్వ నాశనం చేశారు. మైత్రావరుణుడిదీ, మాండవ్యుడిదీ, కౌశికుడిదీ, చండుడిదీ, ఆశ్వలాయనుడిదీ అందరి ఆశ్రమాలూ దగ్ధపటలం చేశారు. ఆశ్రమ వాసుల్ని చంపారు.

రేణుక : చంపుతే భయం లేదు.

గాలవుడు : మీరనుకునే భయం ఉండదమ్మా. వాళ్లకి కావలసినది సమస్తైశ్వర్యమూ, సామ్రాజ్యమూ!

రేణుక : వాళ్లు పగలు వస్తే బాగుండును. హఠాత్తుగా ఆశ్రమం మీద పడితే ఏదీ తెలియదు. రాత్రి నిశ్శబ్దంలో ఎంతో దూరాన్నుంచి వినబడుతుంది గిట్టల చప్పుడు. అంత కంతకు దగ్గరకు వచ్చిన కొద్దీ, ప్రాణాలు నిలబెట్టు కోవడం ఎలాగ?

ప్రియంవద : ఎలాగ ? రాముడు రావడానికి వీల్లేదూ?

గాలవుడు : ఎందుకు వీల్లేదమ్మా? వార్త ఎలాగ అందుతుందని?

రేణుక : గౌతమా! నువ్వు వెళ్లకూడదా రాముడి కోసం?

గౌతముడు : అమ్మా! పిల్లేదు తల్లీ! గురువుగారి దగ్గిర ఉండొద్దమ్మా నేను!

ప్రియంవద : దొంగ వేషం! నీకు త్రోవలో హైహయు లెదురొతారని భయం.

గౌతముడు : నాకు భయం లేదు.

గాలవుడు : ఔను. దర్భపుడకో, పిడకో పట్టుకుని వెళ్లు. మంత్రించేద్దువు గాని, అమ్మా! నేను విభాండకుణ్ణి పంపిస్తా, నేను ఆశ్రమంలో ఉంటా.

రేణుక : గాలవా! నువ్వు ఆశ్రమంలో ఉండు.

గాలవుడు : ఉంటానమ్మా, ఉంటాను. విభాండకుణ్ణి పంపిస్తా. చాలా తెలివైనవాడు. గడుసరి. గురు దేవుల మీద భక్తి చాలా వుంది.

రేణుక : ఆ రుమణ్వంతుడూ వాళ్ళూ ఏరీ ? ఇప్పుడా జపాలు ఏమిటి? తండ్రి దగ్గిరకు పోగూడదూ?

ప్రియంవద : కదలిన కొంతసేపు దాకా అక్కడికి చేరుకో లేరు కూడా. గాలవా? పంపావా?

గాలవుడు : పంపానమ్మా. రుమణ్వంతుడూ వాళ్ళూ ఆశ్రమాంతరం లోకి వెళ్ళారు.

రేణుక : ఎలా గయ్యా?

గాలవుడు : గురుదేవులు ఆశ్రమవాసు లందరికీ ధను ర్వేదమూ, అస్త్ర విద్యా నేర్పి ఉండవలసింది. ఈ దినాల్లో ఎంత అవసరమమ్మా అది. బ్రతికుంటే మోక్షం తర్వాత సాధించుకుందుము. అమ్మా! నడవండి లోపలికి. ప్రియంవదా! నువ్వూను.

ఆశ్రమంలో స్త్రీల నందరినీ ఆ పశ్చిమం వైపు తోపులో కుటీరాల్లో ఉంచండి. పిల్లల్నీ, వృద్ధుల్నీ కూడా! హైహయులు త్వరగా వచ్చి పడితేనే బాగుండును. అమ్మా! యిటూ, ప్రియంవదా, యిటు యిటు, గౌతమా! గురువు గారి దగ్గిరకు వెళ్లు. [కొంత దగ్గిరగా గిట్టల చప్పుడు] అమ్మా! భయం లేదు, పరుగెత్తండి. ఈ ఆశ్రమ ధ్వంసం తేలిపోతే బాగుండును. (కఠినంగా, కోపంగా) త్వరగా త్వరగా తేలాలి. పోవాలి ఈ సోమరులు. రాముడు వస్తే-

రాముడే వస్తే -- జమదగ్నులు వృద్ధులు. ఉహుం నివురు గప్పింది గురుదేవులికి. శివ ధనుస్సుకీ, పరశువుకీ బూజు పట్టించారు. (చాలా దగ్గిరగా గిట్టల చప్పుడు) వస్తున్నా! ధనుస్సు ధూళి దులుపుతున్నా, పరశువు పదునెక్కిస్తున్నా. హైహయ విధానం ఊడ్చి వెయ్యాలి. తర్వాత తపస్సు. ఆఁ పడ్డారు ఆశ్రమంలో రండి, రండి రాక్షసులు. రాముడూ వస్తున్నాడు.

[ఆఁ ఆ అనీ - అమ్మయ్యో, అయ్యో, అనీ-పొడవండి, పొడవండి అని జమదగ్ని ఎక్కడ అని హైహయులు, హైహయులు, కార్తవీర్యుడూ అయ్యో, అయ్యో, రాముడేడీ,? రాముడు? అని రక రకాల కేకలు. రక రకాల గొంతుకల్లో స్త్రీలవీ, పిల్లలవీ ఆర్తనాదాలు. రక రకాల ధ్వనులు. ఒక నిముషం కోలాహలం. గుర్రాలు అంత కంతకూ దూరమైపోయినట్లు, అంత కంతకూ దూరమైన ఆవుల అంభారవాలు, ఒక్క చిటిక నిశ్శబ్దం]

## నాలుగవ రంగము

(జమదగ్ని పర్ణశాలలో మరణశయ్యపై. జమదగ్ని చుట్టూ రేణుకా, రుమణ్వంతుడూ. మొదలైన కుమాళ్లూ, గాలవుడూ, గౌతముడూ, ఆశ్రమ స్త్రీలున్నూ)

రేణుక : [ ఏడుస్తుంది ]

జమదగ్ని : రేణుకా! ఏడవకు. ఆశ్రమ వాసు లేడవకూడ దని కాదు. నేను ఏడుపులు వినలేను [ఆయాస పడుతూ అన్నట్లుగా అనాలి]. ఇంక ఏడుపు పనికి రాదు. రుమణ్వంతు డేడి?

గాలవుడు : ఇక్కడ ఉన్నాడు.

జమదగ్ని : ఇప్పుడు కాదు. వాళ్లు వచ్చినప్పుడు.

గాలవుడు : స్త్రీల కుటీరంలో ఉన్నాడు. పడమటి తోపులో.

జమదగ్ని : సుషేణుడు?

గాలవుడు : అక్కడే.!

జమదగ్ని : సరి. వసువూ అక్కడే, విశ్వావసువూ అక్కడే, వీళ్లు నా కుమాళ్లు కారు. పొమ్మను అవతలికి, గాలవా!

గాలవుడు : గురుదేవా! న్యాయం కాదు. తర తరాల ద్రోహా నికి వాళ్లని దండిస్తే ఎలాగ? క్షమించండి, స్వామీ.! తమ పాదాలని అందుకుంటున్నా. తమ తపస్సులో మునిగి యథార్థ లోకంలో పరి స్థితులు గ్రహించారు కారు తమరు. ఆ పురాణ ధోరణిలో పడిపోయారు. వాళ్లూ తమలాగే!

జమదగ్ని : గాలవా! రాముడు వచ్చాడా? అదుగో, రాముడే! ఆ తొందర వానిదే!

[అడుగుల చప్పుడు]

విభాం : వచ్చాడు.

జమదగ్ని : నాయనా!

రాముడు : తండ్రీ! మీ చరణ రజస్సు శిరస్సుపై ఉంచుకుంటున్నాను (రామునిది భయంకరమైన ఉరుమువంటి కంఠ స్వరం ఉండాలి).

జమదగ్ని : రామా! నీ కళ్లు తడియడం లేదేమి! నీ శరీరం కంపించడం లేదు కాదూ? తండ్రీ, తండ్రీ, ఇలా రా, నిన్ను స్పృశించనీ. ఆఁ ఆఁ రామా! రామా, ఏదీ నీ ముఖం. నీ నేత్రాలేవీ. ఆఁ అరుణారుణ మండలం నీ ముఖం. అనల జ్యోతులు నీ కళ్లు. రామా! నీవు యుగ పురుషుడ వోయీ. తెలుసునా? ఇలా రా. నా చెయ్యి వదలకు. రామా! నీవు ప్రళయ రుద్రుడవు కాదూ? అవునా? నా వసంతంలో ఒక్క త్రుటి కాలం, ఒక్క త్రుటి కాలమే నేను ఇలాగ ఉన్నాను సుమా. తరువాత ఆశ్రమ వాసం. జడలూ, తపమూ. రామా! నీకు తపస్సు వద్దు.

రాముడు : చిత్తం.

జమదగ్ని : గాలవా! చెప్పు, నాయనతో చెప్పు, ఆశ్రమ ధ్వంసగాథ, రామా! నేను వెళ్లిపోతున్నాను. తర్పణాలు వదలాలి. వాళ్లు కాదు, నీవు. ఇప్పుడు కాదు, విలయ సంహారం అయ్యాక. చిక్కని హైహయరక్తం కావాలి. రామా! నీవు తర్పణాలు

వదలాలి. నీవే, నీవే.! నాకూ, మైత్రావరుణునికీ, ఆశ్వలాయనునికీ, చందునికీ, అందరికీ! ఎన్ని మదుగుల రక్తం కావాలి? రామా! వింటున్నావా?

రాముడు : వింటున్నా!

జమదగ్ని : రామా! సంహార యాత్రకై బయలుదేరుతావా? పూర్వకర్మ ఎలాగుందో అంటావా?

రాముడు : అనను, అది లేదు నాకు.

జమదగ్ని : రామా! బ్రహ్మ వ్రాత ఆ విశాల ఫాలం మీదిది ఏమి చేస్తావు?

రాముడు : తుడిచి వేస్తాను.

జమదగ్ని : రామా! దుష్టసంహారం కోసము కావించే హింస హింస కాదు, క్రౌర్యమూ కాదు. హైహయ ధ్వంసం జమదగ్ని కోసం కాదు. భార్గ వాశ్రమం కోసం కూడా కాదు. సామ్రాజ్య తృష్ణ, ఐశ్వర్య తృష్ణ, స్వార్థమూ అతిశయించి, అతిశ యించి యుగాంతాన్ని సూచిస్తున్నాయి. ఒకసారి పూర్వ విధానాన్ని ఊడ్చి వెయ్యాలి. నవ్యమంగళ విధానాన్ని కట్టాలి.

రాత్రి పోతూంది. హైహయులు పోతు న్నారు. (కోడికూత దూరాన) ఆఁ నూతన దినోదయం, యుగ ప్రారంభం, రామా! లే, లేవయ్యా. ఏదయ్యా విష్ణు ధనుస్సు, గాలవా! ఆఁ ఎంత ఒయ్యారంగా ఒద్దుపుగా ఉంది?

ఏదీ, పరశువు? ఆహా, ఎంత ఆగ్రహంగా ఉంది? రామా! ఏదీ, ధనుస్సుతో, పరశువుతో, నాకు సాక్షాత్కరించు. అబ్బా! రామా! నీవు నా కుమారుడవు కావు. పో. దూరంగా పో. నీవు వీర విలయ దేవతవు. యుగ నిర్మాతవు. రామా, రామా, రామా! – [జమదగ్ని మరణిస్తాడు. ఒక్క చిటిక నిశ్శబ్దం. స్త్రీలూ, పురుషులూ కలిసి ఈ క్రింది పద్యం పరశురాముని గూర్చి పాడతారు]

శా. త్రేతా ద్వాపర సంధి, నుద్ధత
మదాంధీ భూత విద్వేషి జీ
మూతోగ్ర శ్వసనుండు రాము
డలుకన్ ముయ్యేడు మారుల్ రణ
ప్రీతిన్ వైరిధరా తలేశ్వరుల
జంపెన్ పల్మారన్ దీర్ఘ ని
ర్ఘాత క్రూర కుఠార లూన
నిఖిల క్షత్రోరు కాంతారుడై.

# సుప్రియ

ఆకలి! ఆకలి ! ఆకలి!
ఆగ వింక జీవాలు!
అలసిన మా కంఠా లిక
అరవ లేవు అన్నానికి!
అబ్బా! అబ్బా! అబ్బా!
చీకటి! చీకటి! చీకటి!

చీకు గూళ్ళు మా కన్నుల
జంకి పోవు వెలుగులతో
నింకిపోవు ప్రాణాలు!
అయ్యో! అయ్యో! అయ్యో!
ఆకలి! చీకటి! ఆకలి!

ఈ కరు వెవ్వరి కోసం?
లోకం ఎంతటి మోసం!

ఉపగుప్తుడు : ఆనందా, తథాగతులు శ్రావస్తికి విచ్చేసి నప్పు డెప్పుడూ ఆమ్ర వనం లోనే విడిది చేస్తారట కాదూ?

ఆనందుడు : ఔను. ఉపగుప్తా! ఆమ్ర వనం ఎలాగుందో చూశావా? బుద్ధ దేవుల నేత్రాల్లో లాగా శాంత శీతలా లైన చిక్కని నీడలు ఇదివరకు తోపంతా నిండి ఉండేవి. ఇప్పు డొక్క ఆకు జొంప మైనా కనపడదు - అంత వనంలోనూ!

ఉపగుప్తుడు : రెండేళ్ళనుంచి ఒక్క వాన చిను కయినా లేక పోతే!

ఆనందుడు : స్వార్థ మానవుడి హృదయం లాగ ఎంత మాడి పోయి, ఎండి ఎండి ఎంత శుష్కంగా ఉంది నేల! బీటలు బీటలై పోయి, పెను దాహంవల్ల నోఝ్ము సిల్లి వగరుస్తున్న ట్లుంది. ఆరు కాలాలూ కలిసి ఒక్క వేషంగి అయిపోతే? ఉపగుప్తా! ఆ సరస్సు ఒడ్డున? ఆ మామిడి చెట్టు కింద వేదిక మీద భగవానుల విడిది. ఆ కొలను చల్లని తేట నీటితో నిండి ఉన్నప్పుడు, తథాగతుల కళ్లకేసీ, సరస్సు కేసీ చూస్తూ ఉండేవారు.

ఉపగుప్తుడు : ఆనందా! తథాగతుల కీ తోటలో ఇప్పుడు సుఖం ఉండదు.

ఆనందుడు : ఎలా గుంటుంది? వారికి సుఖ మేమిటి? ఆమ్ర వనం కన్నా కూడా ఈ శ్రావస్తి మహా శ్మశానం లాగ లేదూ? ఆకుల కన్నా శుష్కించి ఎంత తరుచుగా రాలిపడి ఉన్నాయో - ఈ వీథుల్లోనూ, వీదుల్లోనూ మానవ కళేబరాలు!

ఉపగుప్తుడు : మహా ప్రభువుల కళ్ళల్లో ఇదివరకు వారి హృదయం చల్లగా తొంగి చూస్తూ ఉండేది.

ఆనందుడు : ఔను. ఇప్పుడు వారి కళ్ళు శ్రావణ మేఘాల్లాగ లేవు. తడి తడిగా లేవు. ఏదో తొందర వాటిలో, వేడి వేడిగా వెదకుతున్న ట్లున్నాయి. ఇంత ఆవేదన వారి హృదయాని కెన్నడూ కలిగి ఉండదు. ఏ ఒక్క ప్రాణి కయినా ఏ రవంత బాధ ఉన్నా వారికి వేదన తప్పదు సుమీ ఉపగుప్తా! అబ్బా! (నిట్టూరుస్తాడు) ఆఁ - ఇదీ రాజవీథి! ఇటు పోదాం ఆఁ - జాగ్రత్త ఉపగుప్తా, త్రొక్కుతావు! వంగుని చూడు, అది శవమో, ఇంకా ప్రాణం నిలిచి ఉందో దానిలో?

(కుక్క దగ్గిరగా భౌంయి మని దీర్ఘంగా అరుస్తుంది.)

ఉపగుప్తుడు : పాపం, ప్రాణం ఎప్పుడో పోయింది. ఈ గుడ్డి వెన్నెల్లో వయస్సు ముదిరిన వాడిలాగ లేదు.

ఆనందుడు : ఎన్ని కోర్కెలూ, ఆశలూ ఈ అస్థి పంజరంతో రాలిపోయాయో! మృత్యువు దగ్గిరగా వచ్చిన కొద్దీ ఎంత తల్లడిల్లి పోయిందో ఇతని గుండె? ఉపగుప్తా! అది భయపడ లేనంత అలసిపోయి ఉంటుంది.

ఉపగుప్తుడు : మృత్యు దేవత అడుగు చప్పుళ్ళు ఎలాగ విన పడతాయో! ఎందుకొచ్చిం దీ కరువు? వర్షాలు లేకే?

ఆనందుడు : వర్షాలు లేకే కాదు. మానవుని స్వార్థం వల్ల.

(నృత్య గీతాల కోలాహలం మేళ తాళాలతో - కొంచెం దూరంగా వినబడుతుంది.)

ఉపగుప్తుడు : ఆనందా! ఈ శ్రావస్తిలో ఇప్పుడీ నృత్య కోలాహలం ఏమిటి?

ఆనందుడు : ఇదే తథాగతుల వేదనకి కారణం. మానవుని స్వార్థం, వారి నేత్రాల్లో ఆర్ద్రత పోగొట్టింది. వారి కళ్ళు తడిస్తే వర్షమూ కురుస్తుంది, కరువూ పోతుంది. అయ్యో! ఈ మందిరం ఎవరిది?

ఒక సేవకుడు : ధనగుప్తులది. వారి కుమారుని జన్మదినం అని పెద్ద ఉత్సవం ఏర్పాటు చేశారు. మహా గొప్ప ఉత్సవం! పట్టణంలో సగం మంది వచ్చారు.

ఉపగుప్తుడు : పట్టణంలో సగమయినా మిగిలారా ఉత్సవానికి రావడానికి?

ఆనందుడు : ఉపగుప్తా! ఈ మెట్లెక్కి ఈ ప్రాంగణంలో నిలిచి కాస్త చూద్దాం.

(ఒక మందిరం లోపల నుంచి - పాట, నృత్యం చేస్తూ పాడుతున్నట్లు)

చలిత చలిత మచ్చరణ కటక
మంజీర గళ స్రుత శింజానము నిను
పిలిచి పిలిచినా పలుకరించినా
చలియింపదు మృతశిలయో నీ యెద
చలియింపదు మృతశిలయో!

[' ఓహో', 'ఓహోహో', 'ఆహా', 'మళ్ళీ' - అని కేకలూ, ఆనందంతో లాగా నవ్వులూను. సందడి కొంచెం చల్లారాలి. కొంచెం నక్కకూతలు కలియాలి.]

ఆనందుడు : ఉపగుప్తా! రా, పోదాం. ఈ ఉత్సవంలో తప్ప త్రాగిన ఈ భోగులు ఈ మెట్లన్నీ దిగగలరా? (పసిపిల్ల ఏడుపు) అన్నా! ఎవర్నో త్రొక్కాను. ఉపగుప్తా! చూశావా, చనిపోయిన తల్లిని ఎలాగ పీకుతూందో ఈ పసికూన. (గద్గదికతో) రా! నా కూనా! నా కన్నా, రా (పసిపిల్ల ఏడుపు). ఆశ్రమ వనంలో మీ అమ్మ ఉంది. అయ్యో! కాస్త పాల చుక్కగావి.... (ఒక్క చిటిక నిశ్శబ్దం) ఆఁ ఉపగుప్తా! నెమ్మదిగా నడుద్దాం, ఈ బిడ్డకోసం. ఈ క్షామం వర్షాలు లేకే వచ్చిం దంటావా? అలాగ ఐతే, ధనగుప్తుని కీ కరువు రాలేదేం? ఒక్క వారం నిలవ వలసిన వెయ్యి ప్రాణాల్ని ఒక్క జన్మ దినోత్సవం మింగేసింది. (పసిపిల్ల ఏడుపు కాస్త గట్టిగా) ఏడవకు. ఏడవకు (బుజ్జగిస్తాడు) వద్దు, వద్దు, నా బిడ్డా! ఏడవకు. (మూలుగు నీరసంగా) అయ్యో! అయ్యా, ఎవరు నీవు? ఉపగుప్తా! ఈ కమండలువు లోని నీటి చుక్కతో ఇతని నోరు కాస్త తడుపు (నిట్టూరుస్తాడు). వరుసగా ఈ కుటీరాలు ఎంత దీనంగా ఉన్నాయో, తలుపులు కూడా తెరుచుకుని, ప్రాణాలు పోయిన బొందెల్లాగ! ఉపగుప్తా! నక్కలు ఇళ్ళల్లోకి ఎలాగ చొరబడుతున్నాయో! ఎందుకో తెలుసునా? ఒక్కొక్క పేదకుటీరం ఒక్కొక్క చిన్న వల్లకాడు సుమా! ఆఁ అదేమిటి? అక్కడ ఆ దీపాలూ, సందడీ ఏమిటి? ఆఁ అది రత్నాకరుడి ప్రాసాదం.

ఉపగుప్తుడు : అక్కడా ఏదో విందో వేడుకో జరుగుతుండాలి. ఆనందా! ప్రాంగణంలో పందిరి క్రిందికి కదలలేని

దేహాలు ఈడ్చుకుంటూ, చూడలేని కళ్లని మందిర ద్వారంవైపు ఎలాగు త్రిప్పుకొని పడి ఉన్నారో, ఆ దిక్కు మాలిన వాళ్ళు! వాళ్ళ కన్న ఆ కాగడాలు కదిలిస్తున్న నీడలే ఎక్కువ ప్రాణాలు ఉన్న వాటిలాగ ఉన్నాయి.

[మేళ తాళాల సందడి మళ్ళీ దగ్గరగా వస్తుంది - ఒక మందిరంలో నుంచి.]

పాట - నృత్యం చేస్తూన్నట్లు

*ఓయి సఖా! వినుమోయి సఖా!*
*వినుమోయి సఖా! వినుమోయి సఖా!*
*మాయని మధువని!*
*తీయని ఆమని!*
*ప్రాయ మింక కయి*
*ప్రాలని తేనియ సఖా! వినుమోయి సఖా !*

['మళ్ళీ', 'మళ్ళీ', 'ఏదీ', ' ప్రాణమింక' అని మందంగా ఒకగొంతు, నవ్వులు]

**ఉపగుప్తుడు** : ఆమనీ! మధువనీ! ఆనందా, నీకు రోత పుట్టడం లేదూ?

**ఆనందుడు** : రోతా, కోపమూ ఎవరి మీద ? ఎందుకు? ఇదొక రోగం. సంఘ విధానంలోనే ఉంది. బుద్ధదేవులకు వీరన్నా జాలే! సుఖ దుఃఖాలకీ, కోప తాపాలకీ, అతీతమైన వారి హృదయంలో ఒక్క కరుణే నిండి ఉంది. ఉపగుప్తా! వీరికి క్షామ మనీ, దారిద్ర్యి మనీ, వారికి స్వార్థ మనీ, కామ మనీ అందరి మీదా కరుణే!

[ఒక్కొక్క సారి దూరాన్నుంచి నృత్యాల సందడీ, ఒక్కొక్క సారి నకు ల కూతలూ. మూలుగులూను.]

ఉపగుప్తా! నడు. ఇదివరకు శ్రావస్తికి భగవానులు విచ్చేసినప్పుడు మహాపట్టణ మంతా మామిడితోట లోకి వచ్చి స్వాగత మిచ్చేది. ఇది రణధీరుని సౌధం. ఈ రణధీరుడూ, ధనగుప్తుడూ అందరూ వచ్చేవారు. వృద్ధులూ, బాలురూ, రోగులూ అందరూ వచ్చేవారు. అందరూ వచ్చే వారు. అందరి మీదా ఆ కళ్ళలోంచి అమృతం కురిసేది. అందరి మీదా కురిసేది! ఆ చిరు నవ్వూ, ఆ చూపూ చూసి! ఇది రత్నమాల ఇల్లు. అది శ్రీమతిది. తథాగతులు పట్టణంలోకి వస్తే, అదిగో ఆ చిన్న కుటీర ముందే సుజాతది, భిక్షుకిది, అక్కడికి దయచేసేవారు. ఆమెకో చిన్న కూతురుంది – సుప్రియ. అప్పుడు మేకపి ల్లని భుజం మీద పెట్టుకుని రాజగృహ వీథుల్లో నడిచారే, అలాగే ఆ సుప్రియని ఆ చేతులలో ఎత్తుకుని ఆమ్రవనంలోకి తీసుకెడుతూండేవారు. అప్పుడు, ఆ చేతుల్లో, భుజాల్లో, వక్షస్థలంలో కళ్ళలోంచి లాగే అమృత వర్షం ఒలికేది సుమా! (పసిపిల్ల ఏడుపు) నా కన్నా! ఏడవకు, ఏడవకు నా కన్నా! ఆమ్రవనంలో నున్న అఖిల జనయిత్రి అంకశయ్యలో పడుకో పెడతాను. అప్పుడు ఆ నేత్రాలలో అశ్రుబిందువు నిలుస్తుందేమో! తథాగతుల కళ్ళే వింటితే, కరువేది? ఉపగుప్తా! అటు నడు తోటలోకి.

## రెండవ రంగము

[ఆ(శమవనంలో ఒక వేదిక మీద బుద్ధ భగవానులు ఆసీనులై ఉంటారు. ఒడిలో శుష్కించిన చిన్న దేహంతో పసిపాప, భగవానుని ముఖం కేసి నమ్మకంగా చూస్తూ వి(శమిస్తుంది. వేదిక (పక్కన ఆనందుడూ, ఉపగుప్తుడూ, ఎదురుగా (శావస్తి పుర వాసులూ.]

ఆనందుడు : అయ్యా, భగవానులు వచ్చేశారని (శావస్తి వాసులు మీరందరూ వచ్చారు. ఇక్కడి ఆర్తనాదాలు బోధి వృక్షచ్ఛాయలో వారిని నిలువనియ్య లేదు. వారి నిక్కడికి పిల్చుకొని వచ్చాయి. ఇది వర కీ ఆ(మ వనం ఎంత చిక్కని తోపులాగ నవనవ లాడుతూ ఉండేదో, ఈ పురవాసుల సమావేశమూ అంత (కిక్కిరిసి ఉండేది. ఇప్పుడు ఈ సమావేశం చూసి, మహా (ప్రభువుల హృదయం వేగిర పడు తూంది. ఇందరు శ్రీమంతు లున్న నగరంలో ఈ కరువెందుకు, ఈ నాశ మెందుకు? అయ్యా, ధనగుప్తా! తథాగతులు నిన్ను (ప్రశ్నిస్తున్నారు, నిన్ను! నీవు ఈ క్షామం పోగొట్టగలవా?

ధనగుప్తుడు : భగవాన్! నా ధన ధాన్యా లన్నీ, కరువు పోగొట్టడానికి వినియోగిస్తాను. తమ అధీనంలో ఉంచుతాను. కాని క్షామం పోగొట్టలేను. ఈ కరు వెంతకాలం ఉంటుందో నాకు తెలుసునా? రెండేళ్ళనుంచి వర్షాలు లేవు. (ప్రజల అవసరానికి అవధి లేదు. నా ఐశ్వర్యానికి ఉంది. (ప్రభువుల సెలవైతే.........

ఆనందుడు : ఔను ధనగుప్తా! క్షామాన్ని నీవు పోగొట్టలేవు. అయ్యా రత్నాకరా!నీవంటి భూస్వామి ఈ సామ్రా జ్యంలో లేడు. నిన్న రాత్రి, నీ ఇంట ఉత్సవం ఎంత వైభవంగా జరిగింది! నీ పీ కరువు పోగొడతావు. ఏమయ్యా!

రత్నాకరుడు : ప్రభూ! నా భాండారాలూ, అన్నశాలలూ, పాన గృహాలూ, తమ సెలవైతే, పట్టణవాసులకి తెరచి ఉంచుతాను. కాని రెండేళ్ళ క్షామ మిది. పంచ భూతాలకే దయలేకపోతే ఎందరు రత్నాకరులు కలసి ఈ క్షామం పోగొట్టగలరు? ఈ క్షణం నుంచి....

ఆనందుడు : చాలు రత్నాకరా, కరువు పోగొట్టే సామర్థ్యం నీకూ లేదు. అయ్యా రణధీరా! మహీ పతీ! అయ్యా! జయసేనా! తథాగ తుల నేత్రాలు మిమ్మల్ని ఎలా పిలుస్తున్నాయో చూడండి. అయ్యో, తలలు వంచి అలా కూర్చుం టారేం ? ఈ మహానగరంలో ఎవ్వరూ...

సుప్రియ : భగవన్! ఔను వీరెవ్వరూ ఈ క్షామాన్ని పోగొ ట్టలేరు. నేను పోగొడతాను. భగవన్! తమ ఆలింగనంలో, ఈ భిక్షుక బాలికను హత్తుకున్న ప్పుడు ఈ శరీరానికి ఏ అమృతం అంటుకుని, హృదయందాకా ఇంకిందో! భగవన్! గంపెడు పిల్లలతో ఆమ్రవనం లాగున్న అనాథ కుటుంబా లెన్నో వల్లకాడై పోయినాయి. నేను స్తిమి తంగా ఉండలేను. పట్టణంలో పగలే నక్కలూ, రాబందులూ తిరుగుతున్నాయి. అడుగు కొక్క అస్థిపంజరం తగలకుండా నగరవీథుల్లో కాలు

పెట్టలేము. దారుణమైన దాహబాధతో ఎంత కాలం ఉట్టి బురదను పీల్చి ఉండగలరు? భగవన్! తమ సెల వెందుకు నాకు? నేనే కరువు పోగొడతాను.

ఆనం, ఉప : మా తల్లీ!

సుప్రియ : భగవన్! ధనగుప్తుడి అన్నశాలలు ధనగుప్తుడివి. రత్నాకరుని పానశాలలు రత్నాకరునివి. ఈ మహీపతులవి, రణధీరులవి, ఎవరి భాండారములు వారివి. ఎవరి కలిమి వారిది. వాటి మీద స్వార్థం చిక్కని మూతలాగ పడిఉంది. భగవన్! అందరి కలిమీ నాది. ఈ భిక్షుకి అంటుంది - అందరి ఐశ్వర్యమూ అందరిదీ - అని - కనుక నా భాండారానికి అవధి లేదు. నా భాండారం అక్షయపాత్ర. నే నింక ఒక్క ప్రాణాన్ని పోనివ్వను, ఈ శ్రావస్తిలో. భగవన్! ఆకలి మంటతో, వేసంగి దాహంతో, కాలిపో లేక కాలిపోయి, తల్లడిల్లి పోయి, యేడవలేక రాలిపోయిన వారికోసం నేనెంత ఏడుస్తున్నానుకొన్నారు! ఇన్ని రోజులు ఎలాగ ఊరుకొన్నానో - నేను సిగ్గుపడి ఏడుస్తున్నాను - భగవన్!

ఆనం, ఉప : మా తల్లీ ! మా తల్లీ!

సుప్రియ · భగవన్! నేను క్షామం పోగొడతా నింక. నా ఐశ్వర్యం బుద్ధ హృదయం.

బుద్ధుడు : సుప్రియా!

ఆనందుడు : (ఆనందంతో) ఉపగుప్తా! కరువు పోయింది. (కన్నీటితో) అన్నట్లు చూడు, తథాగతుల కళ్ళు చెమ్మగిల్లాయి. చూడు - రెండు కపోలాల మీదా రెండు కన్నీటి చుక్కలు - (ఉరుములు మెరుపులు). అవిగో శ్రావణ మేఘాలు కమ్ముకుని వస్తున్నాయి. భగవన్! క్షామం పోయింది. సుప్రియా! సుప్రియా!

సుప్రియ : భగవన్!

(ఒక్క చిటిక జనం ఆనంద కోలాహలం. ఉరుములూ, గాలీ, వానా హోరు.)

సుప్రియ : గీ. *ఒక్క ప్రాణికినే దుఃఖమున్న చాలు*
*తాను కూడ దుఃఖించు ఉదాత్త కరుణ*
*నిండిపోవును గాకిక గుండె గుండె*
*మానవుడు దానవుడు గాగ మారకుండ*

ఆనం, ఉప : సుప్రియా !

*బుద్ధం శరణం గచ్ఛామి!*
*ధర్మం శరణం గచ్ఛామి!*
*సంఘం శరణం గచ్ఛామి!*

(ఆలిండియా రేడియో వారి అనుమతితో)

నవోదయ 1946 జూన్ 2.

# శ్రీముఖలింగం

[ముఖలింగం కళింగలో గొప్ప పుణ్యక్షేత్రం. వంశధారా తీరాన ఉంది, సవరల దేశంలో. ఇప్పచెట్టులో నుంచి పుట్టినది ముఖలింగం. ఇప్పచె ట్టనగా మధూక వృక్షం. మధూక లింగం ముఖలింగం అయింది.]

## మొదటి రంగము

[వెన్నెల రాత్రి. సవరల గూడెముల మధ్య అడవిలో. పల్లె పల్లెల నుంచి ఆడవాళ్లు, మగవాళ్లు, పిల్లలూ వస్తారు. డప్పులూ, డోళ్లూ, బాకాలూ, బూరాలూ, పిల్లనగ్రోవులూ, తాళాలూ తెచ్చి ఈతకల్లూ, ఇప్పతేనే తాగుతూం టారు కొందరు. సవర ఆదెయ్య వాళ్లకు పెద్ద. చిత్తి అతని పెళ్లాం. కొంత అడగి మడగి ఉన్న జనం కలకలం వినబడితే బాగుంటుంది. ]

ఆదెయ్య : ఓహో! ఓహోహో! (పిలుస్తున్నట్టు)

మగ, ఆడ : ఓ! ఓ! (బదులు పలుకుతున్నట్లు)

ఆదెయ్యి : ఆఁ అరే సుంచారా! ఓరి సుంచారా!

సుంచారా : ఓయి!

ఆదెయ్యి : కన్సిమ్‌డా నుంచి వచ్చారా?

సుంచారా : వొచ్చారు.

ఆదెయ్యి : కింతేడా నించి?

సుంచారా : ఆఁ

ఆదెయ్యి : అళదుఖ్, సోదా, లువాబా, సిండీబుర్, ఉ ఆలింగ్ ఊ ళ్లన్నీ వచ్చాయిట్రా?

సుంచారా : ఓఁ. అబాసింగ్ నుంచీ, జోడా సింగ్‌నుంచీ, తాల్‌ముండా నుంచీ, చాల్ ముండా నుంచీ
[పాటలో దిగుతాడు]
అన్ని వూళ్లా నించి వొచ్చారు.
ఆడోళ్లు మగవోళ్లు వొచ్చారు.
పిల్లలూ జెల్లలూ వొచ్చారు.
కల్లులూ కడవలూ తెచ్చారు.
[ఆడ, మగ గొంతుల నవ్వులు]

ఆదెయ్యి : ఆఁ ఆగు ....... ఆవూళ్ల పెద్దల్ని పిలు!

సుంచారా : [గొంతు కెత్తి పిలుస్తాడు సన్నగా, రక రకాలుగా]

ఓ అడియా - ఓ [ అని జవాబు]
ఏ పుత్తూ - ఏ [ అని జవాబు]
బింగ్ బోంగ్ - అ ఆఁ[ అని జవాబు]
లుల్లూ - లూ [ అని జవాబు]
గుమ్మూ, రుగుడూ, మంగడా, బుడియా, లకియా, శనియా, సుకూ!

[కూ అని అయిదారు గొంతుకలతో సన్నగా హెచ్చుగా జవాబు ]
అన్ని వూళ్లా నించి వొచ్చారు
ఆడోళ్లు మగవోళ్లు వొచ్చారు.

ఆదెయ్య : ఛీ, నోరు ముయ్యి. మొగాళ్లనీ, ఆడాళ్లనీ, పిల్లల్నీ అక్కడా అక్కడా కూర్చో పెట్టు. పండుగ మొదలెట్టాలి.

సుంచారా : ఓఁ!
మఱ్ఱి సెట్టూ కాడ మగవోళ్లూ
అత్తి సెట్టూ కాడ ఆడోళ్లూ
వేప సెట్టూ కాడ పిల్లోళ్లూ

ఆదెయ్య : అరేయి ముంగీ, చాలులే! డప్పులూ, డోళ్లూ వచ్చాయా?

సుంచారా : వచ్చాయి.
వాయించండీ వాయించండీ
ముంగీసా నీ ముంగల డోలు
ఉడుమూ ఉడుమూ, డబ డబ డప్పు
ఉడతా ఉడతా ఉత్తుత్త తాళం
కుందేలూ నీ కూసే బూరా
నెమిలీ నెమిలీ జమిలీ బాకా

[అందరూ గొల్లు మని హాయిగా నవ్వుతారు]

ఆదెయ్య : ఆగండి, ఆగండి. అరేయి, మంగడా! నీ పాట పాడరా. బాగా పాడతావు

సుంచారా : నేనో ? [అందరూ నవ్వుతారు]

ఆదెయ్య : ఛస్.

[మంగడా పాట మొదలు పెట్టేముందు ఒక్క అర చిటిక పిల్లనగ్రోవి ఊదాలి. పాటలో ఏదో ఒక్క పాదం అందరూ అంటూ ఉండాలి. ఆ చరణంలో రసాన్ని బట్టి 'ఉస్సు' మని నిట్టూర్పులూ, 'హొబ్బ' అనీ, 'హొమ్మ' అనీ బాధతో అన్నట్టు ఏవైనా చప్పుళ్లు చెయ్యాలి]

ఈత కొమ్మ నీడ లోకి
ఇప్ప పువ్వు జాడ లోకి
సాగిందీ వొక యెన్నెల తీగ
ఊగిందీ వొక యెన్నెల తీగ

[ఈ పంక్తి మగవాళ్లందరూ అనాలి]

యెన్నెల తీగాని సూసి, సన్నీ! నీ వనుకొన్నా
ఎర్ర కొండలాగ కదలకున్నా - నే
నెర్రకొండ లాగ కదలకున్నా.

[ఈ పంక్తి మగవాళ్లందరూ అనాలి]

మర్రి వూడ సందుల్లో, మద్దికొమ్మ గొందుల్లో
తుర్రు మంది వొక యెన్నెల పాము
సర్రు మంది వొక యెన్నెల పాము

[ఈ పంక్తి మగవాళ్లందరూ అనాలి]

యెన్నెల పామూని సూసి సన్నీ! నీ వనుకొన్నా
ఈదరలా గుస్సు రుస్సు రన్నా- నే
నీదరలా గుస్సు రుస్సు రన్నా

[ఈ పంక్తి మగవాళ్లందరూ అనాలి]

ఈతపైని ఇప్పపైని మర్రిపైని మద్దిపైని
జరిగిందీ వొక జీబురు మబ్బు

వొరిగిందీ వొక జీబురు మబ్బు [మగవాళ్లందరూ]

యెన్నెల తీగా సూడక యెన్నెల సొగసూ సూడక
యెదురు టేరు లాగ గొల్లు మన్నా- నే
నెదురు టేరులాగ గొల్లు మన్నా [మగవాళ్లందరూ]

[తరువాత హో అని ఉష్ అని, రకరకాల నిట్టూర్పులు, ఒక చిటిక నిశ్శబ్దం]

ఆదెయ్య : చిత్తీ! మీ రెవరేనా పాడండే!

సుంచారా : నేనో, నేను పాడొద్దూ?

ఆదెయ్య : తంతా పో, అలా పో![అందరూ నవ్వుతారు]

చిత్తి : సుంచారా! నువ్వు పాడతావే? మంగిడీ! నువ్వో? డానీ, జల్లీ, సుక్రీ, ఇండమీ, గుర్వారీ, ఆఁ పన్నీ పాడుతుంది. చెప్పవే ను వ్వేం చెపుతావో.

[పాడవే పాడు అని కొన్ని ఆడగొంతుకలు, తరవాత అర చిటిక నిశ్శబ్దం. ఒక్కచిటిక పిల్లనగ్రోవి పాట పల్లవి, అనుపల్లవి అందరు ఆడాళ్లూ పాడతారు]

పిలవండీ పిలవండీ పిలవండీ
పలికినదాకా బావని పిలవండీ.
[అందరు ఆడవాళ్లూ]

ఎర్రకొండ లోయకాడ యెదురుటేరు ఉందండి.
ఎదురు టేరు పాయకాడ వొదిగి పల్లె ఉందండి.
పల్లెకు తూరుపున బావ ఇల్లు కాడ నిలవండి!
పిలవండీ, పిలవండీ, పిలవండీ
పలికినదాకా బావను పిలవండి.
[అందరు ఆడవాళ్లూ]

ఇప్పపువ్వు తేనెల్లో యెన్నెల చలువల్లు పోసి
యీతకల్లు జల్లుల్లో ఈదర తావుల్లు దూసి
తేనె కన్న కల్లుకన్న తేట వలపు తలవండీ
పిలవండీ పిలవండీ పిలవండీ
పలికినదాకా బావని పిలవండీ
[అందరు ఆడాళ్లూ]

[హా అని, 'ఉస్' అనీ నిట్టూర్పులు]

ఆదెయ్య : చిత్తీ! సన్ని పక్కాని ఎవరే ఆ పిల్ల?

చిత్తి : దాని చెల్లి.

ఆదెయ్య : అది పాడుతుందా? దానికి పెళ్లి కాలేదు కదూ! వోపాట పాడ మను.

సుంచారా : నేను పాడతాను.

ఆదెయ్య : ఒరే సుంచారా, నీకు బుద్ధి లేదురా! నీ వెధవ పాటలు రోజూ, అస్తమానూ వినలేక చస్తున్నాం. జిల్లీ, నువు పాడవే!

[పాట ముందు ఒక చిటిక పిల్లన్గ్రోవి వాద్యం. పాట మధ్య మధ్య రసాన్ని బట్టి నవ్వులతో, నిట్టూర్పులతో హాహాకారాలతో ఆడవాళ్లూ, మగవాళ్లున్నూ]

పల్లె వాడు పిట్టల్నిపట్టుకుందు కొచ్చాడు
పల్లెవాణ్ణి తలచుకొనీ వొళ్లంతా జల్లు మంది

పల్లెవాడు వల వేసీ మిన్నులు చూశాడు
వాణ్ణి చూసి, వల చూసీ కన్నెలు దూశారు....

పల్లెవాడు కళ్లు దింపి దిక్కులు వెదికాడు
వాణ్ణి చూసి వల చూసీ నక్కుతూ వొదిగాను....

పల్లెవాడి వల వల్లగ పాకుతు చుట్టింది.
పల్లెవాడి వల చల్లగ తాకుతు పట్టింది ....

పల్లెవాడు వలతో తన యిల్లు చేరుకొన్నాడు.
ఇల్లంతా కలయ చూసి గొల్లు గొల్లు మన్నాను....

పల్లెవాడు పిట్టల్ని పట్టుకుందు కొచ్చాడు.
పల్లె వాణ్ణే తలుసుకునీ క ళ్లంతా నీ ళ్లవును ....

[ ఈ పాట అయీ అవగానే ఈ క్రింది పాట పాడాలి. తొందర తొందరగా నృత్యం చేస్తున్నట్టు గిరగిరా, గిరగిరా మగవాళ్లు అడిగినట్టు ఆడవాళ్లు బదు లన్నట్లు]

మగవాళ్లు : పట్టాడా? పెట్టాడా? పల్లేవాడూ పట్టాడా?
ఆడవాళ్లు : కట్టాడా? కట్టాడా? కన్నేపడుమని కట్టాడా?
మగవాళ్లు : *పోదామా? పోదామా? జోడాసింగూ పోదామా?*
ఆడవాళ్లు : *పోదామా? పోదామా? ఆబాసింగూ పోదామా?*

[ఈ పాట అంత కంతకు తొందరగా పాడుతుంటే హఠాత్తుగా మధ్యని దూరాన 'అమ్మయ్యో, అయ్యో' అనే ఆర్తనాదం ఆడదాని గొంతుకలో వినబడు తుంది]

ఆదెయ్య : ఆగండిరా, ఆగండి. ఎవరో పాపం, ఏడుస్తున్న ట్టున్నారు. అరుస్తున్న ట్టున్నారు.
[ఒక్క రొక్కరే పాట ఆపుతారు. ఒక్కచిటిక నిశ్శబ్దం]

సుంచారా : దెయ్యం కాదు కదా?

ఆడవాళ్లు : అమ్మయ్యోయి, బాబోయి [వీలుంటే ఒక చిన్నపిల్ల ఏడ్చినట్టు]

ఆదెయ్య : ఉండండ్రా, నేను చూసి వస్తాను. అటువైపు కాదూ, ఆ జువ్వి చెట్టు దగ్గిర్నుంచి వచ్చింది. ఆ ఁ [అని ఆశ్చర్యం లాగ ఆగుతాడు]

[అదుగో, అదుగో అవి, ఎవరో ఆడమనిషి అవీ, పాపం అవీ, రకరకాల గొంతులతో వినపడాలి.]

సుంచారా : పాపం భయపడుతూం ద్రా. మన సవరది కాదు. అలిసిపోయి నట్టుంది. అరరే పడిపోతూంది.

ఆదెయ్య : చిత్తి, ఆ మనిషి నోట్లో ఇంత ఇప్పకల్లు పొయ్యి. ఆఁ తేరుకుంది, కదులుతూంది . పొండ్రా అందరూ ఇళ్లకి. చాలా రాత్రయింది. ఇంక పండుగ సరి. ఊఁ, లెండి నడవండి. ఊఁ (చాలా అడుగుల చప్పుడూ అవీవి ఆకుల మీదలాగ) చిత్తీ! ను వ్వింటికి పో!

చిత్తి : నేను పోను.

ఆదెయ్య : ఏమి? నువ్వు పోవాలి. ఊ వెళ్లు. [గద్దించినట్లు]

చిత్తి : [కోపంతో నసుగుతున్నట్టు] ఆఁ అలాగే. నేనుం టేనేం? పాపం, వెళ్లూ.

ఆదెయ్య : ను వ్వెందు కాగావురా ముంగీ?

సుంచారా : పోతున్నా నయ్యా!

ఆదెయ్య : ఫో. కోతీ!

[సుంచారా పోతున్నట్లు అడుగుల చప్పుడు]

## రెండవ రంగము

[ఆ రాత్రి ఆ అడవిలోనే సవర ఆదెయ్యా - ఆక్రొత్త స్త్రీన్నీ]

ఆదెయ్య : ఎవరు నువ్వు?

స్త్రీ : మీ రెవరు?

ఆదెయ్య : సవరలం.

స్త్రీ : అంటే?

ఆదెయ్య : సవరలం. నేను సవర పెద్దని. ఆదెయ్య నా పేరు.

స్త్రీ : అలాగా? ఇ దేవూరు? ఇక్కడ ఏ ఊరూ లేదే?

ఆదెయ్య : అల్లదిగో, ఆ తోపు వెనకాల నిద్ద రోతోంది. అల్లుఖ్. ఆ ఊరు మాది.

స్త్రీ : జగన్నాథం ఎక్క దుందయ్యా? ఇక్కడి కెంత దూరం?

ఆదెయ్య : అబ్బో, ఎక్కడ జగన్నాథం నాలుగు రోజుల దూర ముంది.

స్త్రీ : అమ్మయ్యో, అమ్మో, అమ్మయ్యో! (అని ఏడుస్తుంది)

ఆదెయ్య : ఏడవకు, ఏడవకు, భయం లేదు. ఆc, మీ దేవూరు? చెప్పావు కాదు.

స్త్రీ : మాది శ్రీశైలం.

ఆదెయ్య : ఆ దేమో?

స్త్రీ : జంగాలం. మే మందరమూ కలిసి కాశీ వెడు తున్నాం. నేను ఇరుగు పొరుగు వాళ్లతో బయలుదేరాను. ఇవాళ తెల్ల వారగట్ల నేను

లేచి అక్కడ నదిలో స్నానం చేసి శివలింగ పూజకై పోయినప్పుడు మిగిలినవాళ్లు వెళ్లిపోయారు. నేను తోవ తప్పాను. పగ లల్లా ఈ అడవిలో తిరుగు తూనే ఉన్నాను. అబ్బా! అమ్మయ్యో, జీబురు, చీకటి, పులులూ. ఎలుగు గొడ్లూ ఉన్నాయా ఈ అడవిలో?

ఆదెయ్య : ఉన్నాయి అడవి పందులూ, రేచులూ!

స్త్రీ : అమ్మయ్యో!

ఆదెయ్య : భయం లేదు.

స్త్రీ : నేను కాశీ వెళ్లాలి.

ఆదెయ్య : నీ పేరేమిటి ?

స్త్రీ : చిత్కళ

ఆదెయ్య : అ దేమో–ఆ మెళ్లో, అ దేమిటి?

స్త్రీ : లింగకాయ, శివలింగం.

ఆదెయ్య : అ దేమో, నిన్ను లింగి అని పిలవనా?

లింగి : ఎందు కలా పిలవడం? పిలవవద్దు.

ఆదెయ్య : పిలుస్తాను. లింగీ, లింగీ. పలికినదాకా పిలుస్తాను. లింగీ! ఓ లింగీ!

లింగి : ఊఁ

ఆదెయ్య : లింగీ! నామాట విను. నువ్వు కాశీకి వెళ్లలేవు. కాశీ ఎక్కడుందో ఏమో! లింగీ! నువ్వు వెళ్లొద్దు. నామాట వినవూ లింగీ! నేనూ రానా? వద్దు లింగీ! అలాగ చూడకు – కళ్లతో నవ్వుతున్నట్లు

నేను వెళ్ల నివ్వను, లింగిని. అంతే, ఎందుకు నవ్వుతావు లింగీ?

లింగి : [గల గల నవ్వుతుంది] ఎందుకు నవ్వకూడదు?

ఆదెయ్య : నవ్వితే నిన్ను వదల లేను కనక. నిన్ను వెళ్లనివ్వను.

లింగి : [మళ్లీ నవ్వుతుంది] నీకు పెళ్లి కాలేదూ?

ఆదెయ్య : అయింది.

లింగి : ఓహో! సరే నన్ను వొదలలేవూ?

ఆదెయ్య : ఉఁ హుఁ

లింగి : అయితే కాశీకి వస్తావా? రా, మరి!

ఆదెయ్య : లింగీ! నువ్వు అలా అనకు. ఈ వూరినీ నా భార్య నీ, ఈ సవరలనీ ఊరికే వదిలి రాగలనా? రావచ్చునా? పాపం! ఊరికే బాధ పెట్టనా దాన్ని?

లింగి : మరి నేను వెళ్లవద్దూ?

ఆదెయ్య : శ్రీశైలంలో నీ వాళ్లు ఎవ రున్నారు?

లింగి : శివుడు

ఆదెయ్య : కాశీ లో ఎవరికోసం వెదుతున్నావు? అక్కడ ఎవ రున్నారు?

లింగి : శివుడు.

ఆదెయ్య : అక్కడా ఇక్కడా కూడా ఉన్నాడా అతను?

లింగి : ఆఁ! ఇక్కడా ఉన్నాడు.

ఆదెయ్య : అయితే ఇక్కడ ఉండిపో! [ పక పక నవ్వుతాడు] ఏడీ ఇక్కడ శివుడు? నాతో నువ్వుంటే పోట్లాడ

తాడా శివుడు? [పక పక నవ్వుతాడు] అడవి పందిని చంపగలడా ఒక్క బాణంతో? [పక పక నవ్వుతాడు] కొండ చివార కెక్కి కూర్చోగలడా? [పక పక నవ్వు] పాముల్ని పట్టుకో గలడా? [పక పక నవ్వు] శివుడు, శివుడు! [నవ్వు - పకపకా]

లింగి : [పకపక నవ్వుతుంది] ఆఁ అన్నీ చెయ్యగలడు, చేస్తాడు.

ఆదెయ్య : సవరా అతను ?

లింగి : ఆఁ సవరే.

ఆదెయ్య : పె ళ్లయిందా?

లింగి : ఆఁ అయింది.

ఆదెయ్య : పెళ్లాం సవరా?

లింగి : ఆఁ సవరే.

ఆదెయ్య : మరి నువ్వెందుకు? నాతో నువ్వుంటే పోట్లాడ తాడా శివుడు?

లింగి : నాతో ను వ్వుంటే పోట్లాడు తుందా నీ పెళ్లాం?

ఆదెయ్య : పోట్లాడదు. ఇద్దరూ ఉంటారు.

లింగి : [నవ్వుతూ] పోట్లాడదు. ఇద్దరూ ఉంటారు.

ఆదెయ్య : [ పక పక నవ్వుతూ ] హ హ్హ హ్హ. శివుడు లేడు. ఊరికే అన్నావు. అదా? హ హ్హ హ్హ. లింగీ, ఓ లింగీ, నేను చిత్తిని చూపిస్తా. చిత్తి నా పెళ్లాంలే - నేను చిత్తిని చూపిస్తా. నువ్వు శివుణ్ణి చూపిస్తావూ? హ హ్హ హ్హ ! ఇప్పకల్లు తాగితే చూపిస్తావా? ఈతకల్లు తాగితే చూపిస్తావా?

హ హ్హ హ్హ ! ఇప్పచెట్టులోనే చూపించాలి. లింగీ, నడు. [పక పక నవ్వుతాడు] ఆఁ అల్లదిగో. అదీ ఊరు. ఆ ఉత్తరం వైపు ఊరు చివర్ని ఇల్లు లేదూ! ఎదురుగా ఇప్పచెట్టు ఉంది. అదీ మన ఇల్లు - నడు.

లింగి : [ పక పక నువ్వుతుంది. అంత కంతకు ఇద్దరి నవ్వూ దూర మౌతుంది]

## మూడవ రంగము

[సవర ఆదెయ్య ఇంటి ముందు. తెల్లవారలే దింకా. కొక్కొరోకో అని కోడి ముమ్మారు కూస్తుంది.]

లింగి : శివ శివా, శివ శివా, శివ శివా, నన్ను ఈ కోడి లేపడ మెందుకు? నిద్ర పోయిన వాళ్లని లేపాలి. లేవ వలసిన వాళ్లని లేపాలి. నాకు నిద్ర లేదు, మెలకువా లేదు. శివుడికీ లేదు - ఈ ఇప్ప చెట్టుకీ లేదు. అన్ని వేల పువ్వులూ అన్ని కళ్లలాగ విప్పుకుని చూస్తుంది. ఎందుకు అలాగ వణుకుతుంది ఇప్పచెట్టు? ఒకనాడు గడగడ లాడుతుంది, ఒకనాడు గండురాయి లాగ కద లదు. అన్నీ నా చేష్టలే దీని వని మా సవతి చిత్తి అంటూంటుంది. ఆహా! శివా శివ! సదా శివ!

తెల్లవారక మున్నె కళ్లు తెరపించు
కళ్లు తెరవక మునుపె ఒళ్లు మరపించు
నిదరకన్నా నీడ పాదివి నను ముంచు
మదిరకన్నా మగత మనసు హరియించు
*లోకేశ్వరా, శివా, ప్రాణేశ్వరా, భవా!*
*శివ శివా, శివ శివా, శివ శివా!*

ఇంక కదలాలి! వంశధారలో స్నానానికి. అల్లదిగో తూర్పున ఆకాశం ఇప్పపూవు వన్నెగా మారుతూంది. ఏటి ఒడ్డున వెదుళ్లు ప్రారంభించాయి పాటలూ, పదాలూ, వెదుళ్లకి తొందర ఎక్కువ. వేళ్లు తగల నక్కర లేదు - ఒళ్లు మరవ డానికీ, జల్లు మనడానికిన్నీ.

*పురహరా, హర, వికస్వర ధృక్స్ఫురద్దయో*
*దార ధారర, వంశధార*
*లోల కరముల, విలులి*
*తాళి రవముల, నెత్తి*
*వేగుబోకకు మున్ను*
*వేయి విధముల నన్ను*
*పేరెత్తురా పిలుచు నౌరా!*

[పాడుతూ దూరంగా వెడుతుంది. హరహర అంటూ, శివశివా అంటూ వెడుతుంది. ఒక్కచిటిక నిశ్శబ్దం. మరీ దూర మయినట్లు, అంతలో స్నానం చేసినట్టు, మళ్లీ వస్తూన్నట్టు, అంత కంతకు దగ్గిరగా 'హరహరా, శివ శివా' అంటూ వినపడాలి. దగ్గరగా వచ్చాక మళ్లీ పాట ]

*నీలగళ నీ చరణ*
*యుగళ నీరజ గళ*
*న్మధుధారరా, వంశధార*
*క్రోలుకొలదీ, మునిగి*
*తేలుకొలదీ మనసు*
*తాళనేర్వదు, బాళి*
*నోర్వజాలదు, హరా!*
*కైలాసగిరి ఎంత దవ్వురా!*

ఆహా! కైలాసగిరి ఇప్పచెట్టు దగ్గిర కొచ్చింది. ఇప్పచెట్టు ఈ లింగి కోసం ఎదురు చూస్తూంది.

కైలాసగిరి నుండి కాశికై
కాశికా పురినుండి దాసికై
వేంచేసినా వయ్యా, విశ్వ విశ్వేశ్వరా
హర హరా, హర హరా, హర హరా!

చెట్టు కింద ఇవాళ ధూళి ఉందేం? తుడుస్తాను. [తుడిచిన చప్పుడు] ఈ వంశధార నీళ్లు చల్లాలి [చల్లిన చప్పుడు] ఈ నీళ్లూ ఈ ఇప్పపూ తేనే కలిసి, కాలి నంటుకుని కదల నీయడం లేదు. ఇది పరమ శివుని దయలాంటిది. పట్టుకుని వదలదు.

విరిసి జాబిలి మల్లిరేకగా
కురిసి తేనియల మువ్వాకగా
దరిసి నీ దయ వంశధారా పయస్సురా
హర హరా, హర హరా, హర హరా!

ఈ చెట్టు పువ్వులు కోయ నక్కర లేదు. అవి రాలడమే! ఆఁ ఇలాగ ప్రోగుజేస్తాను. ఇంక పూజ జేస్తా. ఊఁ హుఁ 'ఇవ్వాళ ఒక్కొక్క పువ్వే వెయ్య లేను. అన్నీ దిమ్మరిస్తా..... ఓహో శివుడి కెంత దయ! కాకపోతే ఈ ఇప్పపువ్వులు బంగారపు పువ్వులు ఎలా గవుతాయి.? పాపం! అవి చిత్తి కొమ్మలవి. అవి బంగారం కా వని చిత్తికి కోపం. ఈ పువ్వులకి జోడాసింగ్ కోమటి దానికి ఒక నాణె మిస్తే, నాకు బుట్టెడు నాణాలు ఇస్తున్నాడు. శివా, సాంబ శివా! ఇది న్యాయం కా దయ్యా! నీకు అంతా ఒకటే! కాని మంచి చిత్రమైన వాడ వయ్యా, శివ శివా!

ముక్కోటి దేవతల నేతరా
ముల్లోకముల కిష్టదాతరా
వెలిబూది పూతరా నలవిసము మేతరా
హర హరా, హర హరా, హర హరా!

ఓహో రథీకృత క్ష్మామండలా!
ఆహో సరీసృప శ్రీ కుండలా!
నీహార శిఖరి పుత్రీ హారిహృద్వరా!
హర హరా, హర హరా, హర హరా!

* * *

## నాలుగవ రంగము

[సవర ఆదెయ్య ఇంటి దగ్గర కొంచెము ప్రా ద్దెక్కుతుంది]

సుంచారా : చిత్తీ! ఓ చిత్తీ!

చిత్తి : ఓ ఓయి, ఎందుకురా, సుంచారా! పిలుస్తావు?

సుంచారా : చూడు, చిత్తీ! ఇప్పచెట్టుకేసి! లింగిని చూడు.

ఇప్పచెట్టూ కింద చేరింది
ఇప్ప పువ్వూ లన్ని ఏరింది
ఇప్పచె ట్టంతటా దూసింది
కుప్పలూ తిప్పలూ పోసింది.

చిత్తి : ఛ! ఊరుకో. దిక్కు మాలినపాటా నువ్వునూ! ఒరేయ్! సుంచారా, లింగి చె ట్టంతా దూసిందిరా?

సుంచారా : లేదులే.

చిత్తి : మరి ఎటువైపు పువ్వులు తీసుకుందిరా?

సుంచారా : చిత్తీ, నీ కెటువైపు కొమ్మ లిచ్చాడు ఆదెయ్య?

చిత్తి : మొదట అటువైపువి ఇచ్చాడు - మంగడా ఇంటి వైపువి. రెండో వైపువి లింగి కిచ్చాడు. లింగి పువ్వు లన్నీ పచ్చని పువ్వు లైపోయేవి బంగారపు

పువ్వులుట, కోమటయ్య అన్నాడు. ఆ పువ్వులికి లింగికి పెద్ద బుట్ట నిండా రూక లిచ్చేవాడు. నే నింటి కొచ్చి ఆదెయ్యతో పోట్లాడాను. తిట్టాను, ఏడ్చాను. ఇప్పు డా కొమ్మలు నా కిచ్చాడు.

సుంచార్రా : ఇప్పు డీ కొమ్మలవి బంగారపు పువ్వు లయ్యాయి. అవునా చిత్తీ?

చిత్తి : ఇదిగో చూడు. ఆదెయ్యని ఎలా అడుగుతానో. అడుగో, వస్తున్నాడు!

ఆదెయ్య : ఏ మడుగుతావు చిత్తీ! నన్ను? చూడు, ఆ లింగిని. లింగి నేస్తం శివు డట. హా హ్హా హ్హా! [నవ్వుతాడు] శ్రీశైలంట, కాశీట, కైలాసంట. అన్ని చోట్లా ఉన్నాడట. ఇక్కడ ఇప్పచెట్టులో ఉన్నాడట! హ హ్హా హ్హా! [నవ్వుతాడు.] నాకు చూపిస్తుం దట లింగి శివుణ్ణి - హ హ్హా హ్హా హాఁ హాఁ [నవ్వుతాడు]

చిత్తి : ఎందుకూ నవ్వుతావు సిగ్గు లేక! ఆ లింగంటే సరి అలాగ అయిపోతావు.

ఆదెయ్య : హ హ్హా హ్హా. ఏం జరిగింది? పిలుస్తా నుండు. లింగీ! ఓ లింగీ!

లింగి : ఎందు కయ్యా!

ఆదెయ్య : ఏమి టీ తగువు మళ్లీనీ?

లింగి : నాకు తగువు లేదే.

చిత్తి : నీ కేం తగువు పాపం! అయిన కాడికి మొన్నొచ్చి-

లింగి : అయితే?

చిత్తి : అయితే నేంది? గియితే! ఆదెయ్యా అడుగుతే పోనీ అని జాలి పడి ని న్నిక్కడ ఉండనిచ్చి నందుకా?

లింగి : అవును చిత్తీ, ను వ్వుండ మంటేను గదా ఉన్నా నిక్కడ?

చిత్తి : అయితే ఈ దెయ్యాలూ, భూతాలూ ఎందుకూ?

లింగి : దయ్యా లేమిటి?

చిత్తి : ఇప్పపువ్వులు దగ్గిర.

లింగి : మొదట నాకు ఉత్తరం వైపు కొమ్మ లిచ్చాడు. అవి నువ్వు కావా లంటే తర్వాత దక్షిణం వైపు విచ్చాడు. ఏమీ? ఇంతేనా? నీకు ఉత్తరం వైపువే కావాలా?

చిత్తి : నోరు ముయ్యి!

ఆదెయ్య : ఆఁ ఆఁ చిత్తీ!

సుంచారా : కన్ను మంది ఎదురుటేరు
బున్ను మంది పాములేరు
నడుమ నున్న ఎఱ్ఱకొండ
*గడ గడ* లాడింది.

ఆదెయ్య : ఛా! ఊరుకో.

చిత్తి : నోరు విప్పితే తన్నిస్తా, సుంచారా.

ఆదెయ్య : చిత్తీ, ఏమి చెయ్యమన్నావు?

చిత్తి : ఆ లింగి నడుగు

ఆదెయ్య : ఏమి లింగీ?

లింగి : ఏమి చెయ్య మన్నా వయ్యా! దయ్యాలూ లేవు, భూతాలూ లేవు. నా కే మంత్ర తంత్రాలూ రావు. ఇప్ప చెట్టులో శివు డున్నా డంతే!

ఆదెయ్య : హ హ్హ హ్హ - [నవ్వుతాడు]

చిత్తి : నాకు వళ్లు మండుతుంది!

ఆదెయ్య : ఎందుకు?

చిత్తి : ఎందుకా? ఆ చె ట్టంతా నా కియ్యి.

లింగి : తీసుకో.

ఆదెయ్య : ఆ చెట్టులో శివుడో? హ హ్హ హ్హ.

లింగి : ఉన్నాడు. ఇవతలా ఉన్నాడు.

చిత్తి : అలా కాదు రండి. రా లింగీ! రా ఆదెయ్యా. రారా సుంచారా! చెట్టు దగ్గిర కెడదాం నేను కోస్తా పువ్వు లన్నీ, ఏ మవుతాయో?
[అందరూ వెళ్లిన చప్పుడు]

* * *

## అయిదవ రంగము

[ఇప్పచెట్టు కింద ఆదెయ్య, లింగీ, చిత్తీ, సుంచారా ]

చిత్తి : సుంచారా! పువ్వులు రాల్చరా. కొయ్యరా! త్వరగా, ఆఁ ఇంక కుప్పలుగా పోద్దాం. ఆ. అన్నీ ఇక్కడ, ఇలాగ ఇ దేమిటి? లింగీ! ఈఁ పువ్వులు పచ్చగా ఆవవేం? ఇదిగో, ఇదే మంత్ర మంటాను. నాకు ఇలాంటి కనుకట్టులు పనికిరావు. నీ పని బా గుండ దింక. ఆలోచించుకో!

ఆదెయ్య : అ దేమిటి చిత్తీ! లింగి ఏమి చేస్తుంది, పాపం!

చిత్తి : అలాగా? దాన్ని ఏర మను మిగిలిన పువ్వుల్ని.

ఆదెయ్య : ఏరు లింగీ. (ఒక్క చిటిక నిశ్శబ్దం)

చిత్తి : చూశావా, చూశావా? ఆఁ ఆఁ దాని వేషాలూ గీషాలున్నూ. అవిగో అవి బంగారం అయ్యాయి.

ఆదెయ్య : లింగీ! అవి ఎందు కలాగ అయ్యాయి?

లింగి : ఇప్ప చెట్టులో శివు డున్నాడు.

ఆదెయ్య : హ హ్హ హ్హ! మరి చిత్తికి మాత్రం లేదూ?

లింగి : ఉన్నాడు. అందరి చెట్లలోనూ ఉన్నాడు. చిత్తి చెట్టులోనూ ఉన్నాడు.

ఆదెయ్య : మరి?

లింగి : చిత్తికి కొ ప్పుంది, పువ్వు లున్నాయి, కోమటి ఉన్నాడు. అమ్మితే రూక లున్నాయి. చిత్తికి శివుదు లేదు. శివుడికి చిత్తి ఉంది.

ఆదెయ్య : నీకు లేదూ కొప్పు?

లింగి : ఉంది. అన్నీ శివుడి కోసమే ఉన్నాయి.

చిత్తి : నీ మొహం కోసం ఉన్నాయి.

ఆదెయ్య : అబ్బబ్బబ్బ చిత్తీ, లింగీ, చెప్తున్నాను. వినండి. ఇంక ఈ ఇప్ప చెట్టుని కొట్టేస్తా. నేను చస్తు న్నాను నడిమిని. ఏం చిత్తీ? ఏదిరా గొడ్డలి సుంచారా! ఏం చిత్తీ?

చిత్తి : కొట్టెయ్యి.

ఆదెయ్య : ఏం లింగీ?

లింగి : కొట్టెయ్యి.

ఆదెయ్య : పాపం నీ శివు దుంటే ఇవతలి కొస్తాడులే. ఏం? ఉన్నాడా?

లింగి : ఉన్నాడు.

[హుమ్మని చెట్టుని ఆదెయ్య నరుకుతాడు. ఉరుములూ, ఫెళ ఫెళ ధ్వనులూ, గంటా - జంగాలది - మోగింది. భొంభొంభొం అని శంఖం మోగాలి. వీరాంగం, డోలూ మోగాలి. జనం కలకలం. గోల. మధ్యని హఠాత్తుగా చిత్తి కేక.]

సుంచారా : అదేంటి ఆ వెలుగు ఆచెట్టులోంచి! అయ్యయ్యో! ఆదెయ్య సొమ్మసిలి పడిపోయాడు. చచ్చిపోలేదు కదా?

చిత్తి : అయ్యో అయ్యో (ఏడుస్తూ) నేను చెప్పలేదురా అది దెయ్యాల మని షని? ఆదెయ్యని చంపిం దిరా. అయ్యో అయ్యో! గుల్వారా, బడియా, లకియా రండి! దీన్ని చంపండి. అయ్యో అయ్యో.

[జనుల గోల. చంపండి, కొట్టండి, కాళ్లూ చేతులూ విరవండి, పొడు, పొడు అని కేకలు. శంఖం - జంగాలది - మోగుతూనే ఉంటుంది. డమ డమ డోలూ మోగుతూంటుంది. హఠాత్తుగా నడుమ 'ఆగండి' అని మేఘగంభీర కంఠంతో వినపడుతుంది-]

ఒక సవర : ఎవరు మీరు?

రుద్ర భట్టు : నేను రుద్రభట్టుని. బ్రాహ్మణ్ణి. శ్రీకామార్ణవ మహారాజు గురువుని. ఒక నిముషం ఓపిక పట్టండి. [ఆదెయ్య లేస్తాడు] ఆఁ ఆదెయ్యా!

ఆదెయ్య : భట్టారకా, నమస్కారము!

[ఆ దేమిట్రా అలా మాట్లాడతాడు అని సవరల గొంతుకలు]

రుద్రభట్టు : నీవు చిత్రగాయకు డనే గంధర్వుడవు. ఈ సవర అందరూ గంధర్వులే. దోషం చేసి దూరు లయ్యారు శివానుగ్రహానికి. ఈ లింగి చిత్కళా దేవి. ఆ మధూక వృక్షంలో నుంచి వచ్చిన తేజోలింగం మధూక లింగం - ముఖలింగం. ఏమి చిత్కళా!

లింగి : ఇప్పచెట్టులో శివు డున్నాడు. మల్లికార్జునుడూ, మహాదేవుడూ. మధూకేశ్వరుడూ ఒకడే!

ఆదెయ్య : ఔను.

చిత్తి,సుంచారా,
అందరూ : ఔను.

రుద్రభట్టు : అదిగో, అలాగ చూడండి. వంశధారా నది ఒత్తి గిలి వంపుగా అటు ఎలాగ తిరిగిపోతూందో. ఆ వంపులో నిర్మిస్తాడు శ్రీకామార్ణవుడు శ్రీముఖలింగేశ్వరాలయం. ఆలయప్రాంగణంలో, సవర ఆదెయ్యా, లింగీ, చిత్తీ, ఇప్పచెట్టూ, రాళ్ల మీద విగ్రహాలు, శాసనాలతో చెక్కిస్తాడు. రండి. అందరూ. ఈ వృక్షం చుట్టూ ప్రదక్షిణం చేస్తూ పాడండి.

"హిమాచల కుమారికా కుచసముల్లస త్కుంకుమా
సమాన హిమవాలుకా ఘుమఘుమాయితోరస్థలమ్.
(శంఖం భొం భొం అని మోగుతుంది)
బలాహిత శిలా కలాపక కలాపకోద్యత్కలా
విలాస విలసద్గళోజ్జ్వల మిలాధరేంద్రాలయమ్.

(శంఖం భొం భొం అని మోగుతుంది )

ఫణీశధర తారకా శశి మణీ ఘృణీధోరణీ
తృణీకరణ నైపుణీ విలసితాప సవ్యాంగకమ్.
(శంఖం భోం భోం అని మోగుతుంది)
సురాసుర శిరస్ఫురత్కుసుమ మంజరీ నిష్పుత
న్మరందలహరీ పరిస్నపిత పాద పంకేరుహామ్."

(శంఖం ధ్వని)

అందరూ : హరోం హరోం హర, హరోం హరోం హర
హర హర మహాదేవ హర హర మహాదేవ!
జయ జయా శ్రీశైల మల్లికార్జున స్వామికి జయా!
జయ జయా శ్రీకాశీవిశ్వేశ్వరమహాదేవునికి జయా!
జయ జయా శ్రీముఖలింగేశ్వర ప్రభువుకి జయా!
జయా జయా జయ ముఖలింగేశ్వర
జయా జయా జయ హరోం హరోం హర!

ఓమ్:

(శంఖం, గంటా చాలాసేపు మోగాలి)